# పుష్కిన్

## బెల్కిన్ కథలు

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# ఇందులో....


| | |
|---|---|
| సంపాదకుని తొలిపలుకులు | 9 |
| గురికాడు | 21 |
| మంచు తుపాను | 55 |
| అంత్యక్రియల నిర్వాహకుడు | 87 |
| మజిలీ అధికారి | 107 |
| పేదపిల్లగామారిన పెద్దింటి అమ్మాయి | 139 |
| వివరణ | 186 |

మిసెస్ ప్రొస్టకోవా :— ఔను, బాబూ! పసిపిల్లవాడి నాటి నుంచి కథలు వినాలి ఆయనకు ఎప్పుడూ సరదా.

స్కొటినిన్ : మిత్రొ ఫాన్ అంతా నా పోలికే సుమా!

"మూర్ఖుడు"(1)

ఐ. పి. బెల్కిన్ కథలను ప్రచురించి పఠితృలోకాని కందీయడానికి మేము పూనుకొన్నందువల్ల, కీర్తి శేషుడయిన ఈ గ్రంథకర్త జీవిత సంగ్రహం కూడా వీటికి ఉపోద్ఘాతంగా ఇచ్చి మన దేశ సాహిత్యాభిమానుల ఉత్కంఠను కొంతవరకైనా తీర్చడం మాధర్మం. ఈ ఉద్దేశంతో మేము ఇవాన్ పెట్రోవిచ్ బెల్కిన్ సమీప జ్ఞాతీ, వారసురాలూ అయిన మార్యా అలెక్సేయెవ్నా ట్రాఫలినాకు వ్రాశాం. కాని, దురదృష్టవశాత్తు, ఆమె బెల్కిన్‌ను చూచికూడ ఎరుగదు. అందువల్ల అతణ్ణి గూర్చి మాకు ఏ విధమైన సమాచారం

కూడ అందించలేకపోయింది. కాని, ఈ విషయమై ఇవాన్ పెట్రోవిచ్ మిత్రుడయిన ఒకానొక పెద్దమనిషికి వ్రాసి చూడవలసిందిగా ఆమె మాకు సలహా ఇచ్చింది. ఆమె సలహాను పాటించి ఆ పెద్దమనిషికి మేమొక జాబు వ్రాశాం. వారినుండి మాకు వచ్చిన ప్రత్యుత్తరాన్ని యథాతథంగా కింద పొందుపరుస్తున్నాం. సంస్కారం కల ఒక వ్యక్తి ఇంగిత జ్ఞానానికి, స్నేహశీలానికి ఇదొక అమూల్యమయిన స్మృతిచిహ్నం. అంతేకాక ఇదొక చక్కని జీవిత సంగ్రహం కూడ.

మహాశయా,

మీరు ఈ నెల 15 వ తేదీన వ్రాసిన లేఖ, ఈ నెల 23 వ తేదీన అందుకొనే భాగ్యం నాకు అబ్బింది. నా ఆప్తమిత్రుడూ, పొరుగువాడూ అయిన స్వర్గీయ ఇవాన్ పెట్రోవిచ్ బెల్కిన్ జనన, మరణ, ఉద్యోగ ఆంతరంగిక జీవితాది విశేషాలు వివరంగా తమకు తెలియజేయవలసిందిగా తమరు కోరారు. మీ కోర్కె తీర్చటంలో నా మనస్సుకు సంపూర్ణమయిన సంతృప్తి కలిగేలా ఏలాటి ప్రయత్న లోపం లేకుండా చూస్తాను. ఈ దృష్టితో, మేమిద్దరమూ కలసి మాట్లాడుకొనే విషయాలు నాకు జ్ఞప్తికి వున్నంతవరకు (సవ్యాఖ్యానంగా) తెలియజేస్తున్నాను.

ఇవాన్ పెట్రోవిచ్ బెల్కిన్ గోర్యోఖినో గ్రామంలో 1798 లో జన్మించాడు. వారిది గౌరవ మర్యాదలుగల ఒక భూస్వామి కుటుంబం. కీర్తిశేషుడయిన సెకెండ్ - మేజర్ ప్యొటోర్ ఇవానొవిచ్ బెల్కిన్, ట్రాఫిలిన్ కుటుంబానికి చెందిన పెలగేయా గావ్రిలొవ్నా అనే కన్యకను పెళ్ళాడాడు. అతను పెద్ద ధనవంతుడు కాదుకాని పొదుపరి; వ్యవహార దక్షుడు. అతని కొడుకు చిన్నతనంలో స్థానిక క్రైస్తవమత గురువువద్ద చదువుకొన్నాడు. ఈ మతగురువు మూలంగానే బెల్కిన్‌కు పుస్తకాలపైన ప్రీతి, మాతృభాషలో రచన సాగించాలనే అభిరుచి అబ్బిందని తోస్తూంది. 1815 లో బెల్కిన్ జేగర్ పదాతిదళంలో (దీని నంబరు ప్రస్తుతం నాకు జ్ఞప్తిలేదు) చేరి 1823 వరకు అందులో పని చేశాడు. తరువాత తల్లిదండ్రులిద్దరూ ఒకరితరువాత ఒకరు కొద్దికాలంలోనే గతించినందువల్ల, అతను ఉద్యోగం విరమించుకొని స్వగ్రామం చేరి తాత ముత్తాతల ఆస్తిపైన జీవించసాగాడు.

ఇవాన్ పెట్రోవిచ్‌కి, తగిన అనుభవం లేనందువల్లా, అతని మనస్సు వెన్నలాంటిది కావడంవల్లా అనతికాలంలోనే, ఎస్టేటులో తండ్రి కాలంనాటి కట్టుదిట్టాలు సడలి అధ్వాన్నం కాజొచ్చింది. ఉచితానుచితజ్ఞుడూ, సమర్థుడూ అయిన గ్రామ పెద్దపట్ల రైతుల్లో అసం

తృప్తి వున్నదని (వారి నైజమే అది) ఇవాన్ పెట్రోవిచ్ అతన్ని తొలగించివేసి గ్రామ పెత్తనమంతా పూర్వం తన ఇంటిపనులు చూచుకొనే ఒక ముసలి దానికి అప్పజెప్పాడు. ఆ ముసలిది కథలు చెప్పడంలో తనకున్న నేర్పుతో యజమాని విశ్వాసం చూరగొన గలిగింది. 25 రూబుళ్ళ నోటేదో, 5 రూబుళ్ళ నోటేదో తెలియనంతటి అమాయకురాలు ఆ ముసలిది. తమ పిల్లల కెంతమందికో గాడ్ మదర్ గా ఉండే ఈ ముసలిదాన్ని చూస్తే రైతులకు భయమూ, భక్తీ లేదు. రైతులు మరొక గ్రామపెద్దను ఎన్నుకొన్నారు. వాడు రైతుల ఇష్టానుసారం నడుచుకోవడమేగాక, యజమానిని మోసగించడంలో వాళ్ళతో చేయికలిపాడు. దాని ఫలితంగా ఇవాన్ పెట్రోవిచ్ వెట్టిపద్ధతికి స్వస్తిచెప్పి, దానికి మారు కౌలుపద్ధతి ప్రవేశపెట్టాడు. కౌలుకూడ చాలా తక్కువ రేట్లు నిర్ణయించాడు. అయినప్పటికీ, రైతులు తమ యజమాని దౌర్బల్యాన్ని గమనించి, మొదటి సంవత్సరం లేనిపోని సౌకర్యాలనేకం పొందారు. మరుసటి సంవత్సరం తామివ్వవలసిన కౌలులో మూడింట రెండుపాళ్ళు మాత్రమే చెల్లించారు. ఇవి కూడ బిల్ బెర్రీ పళ్ళలాంటివి ఇచ్చి చెల్లగట్టారు. ఇందులో కూడ బకాయిలు పెట్టారు.

ఇవాన్ పెట్రోవిచ్ తండ్రికీ నాకూ చాలా స్నేహం. నా స్నేహితుని కుమారునికి సహాయిచ్చి చక్కదిద్దడం నా ధర్మమని భావించి బెల్కిన్ ఎస్టేటులో పూర్వమునుండి వున్న పద్ధతులను పునః ప్రతిష్ఠించడానికి కృషి చేస్తానని నేనై నేను ఎన్నోసార్లు అతనితో ప్రస్తావన చేసి చూశాను. కడకు ఒకానొకరోజు అతని ఇంటికి వెళ్ళి జమా ఖర్చులపుస్తకం ఇలా తెమ్మని గట్టిగా అడిగి తెప్పించి, దగాకోరైన గ్రామ పెద్దను కూడ పిలిపించి, ఇవాన్ పెట్రోవిచ్ సమక్షంలోనే లెక్కలు తనిఖీ చేయడం ప్రారంభించాను. మొదట మొదట ఆ యువకుడు నేను చేస్తున్న విచారణ బహు శ్రద్ధా భక్తులతో గమనిస్తూ కూర్చున్నాడు. కాని గడచిన రెండేండ్లలో ఎస్టేటులోని రైతుల సంఖ్య పెరగ్గా పశువుల, కోళ్ళ సంఖ్య చాలా తగ్గిపోయిందని లెక్కల్లో తేలడంతోనే ఇవాన్ పెట్రోవిచ్ తృప్తిపడి, ఇంకంతా సరిగ్గా వున్నట్టేనని లెక్కలు వినటం మానేశాడు. నేను, గ్రామపెద్దను ఉక్కిరిబిక్కిరి అయిపోయేలా చేసి, వాడి నోరు మూయించి, చూశావా వీడి సంగతి అని తిరిగి చూతునుగదా, ఆ మహాత్ముడు తనకుర్చీలో తలవాల్చి కప్పెగిరిపొయ్యేలా గురకపెడుతున్నాడు! ఇక అదిసరి, అతని ఎస్టేటు వ్యవహారాల్లో నేను వేలుపెట్టడం మాను

కోసం, అతని వ్యవహారాల్ని ఆ భగవంతుని కృపకు వదలి వేశాను.

కాని ఇందువల్ల, మా అన్యోన్యతకు యేటువంటి భంగం వాటిల్లలేదు. నేడు మన భూస్వామి కుటుంబాల్లోని యువకుల్లో సర్వసామాన్యమై పోయిన అలసత్వమూ, ఔదార్బల్యమూ అతనిలోనూ చూచి నా మనస్సు కెంతో కష్టమనిపించినా, అసలంటే నాకు ప్రాణం అటువంటి జాలిగుండె, దొడ్డబుద్ధిగల యువకుణ్ణి ప్రేమించకుండా వుండలేము. ఇవాన్ పెట్రోవిచ్ సైతం నా పెద్దతనానికి తగినభక్తి ప్రపత్తులు చూపుతూ, నన్నెంతో ప్రేమించే వాడు. మేము కడవరకు ఇంచుమించు రోజూ కలుసు కొనేవాళ్ళం. అలవాట్లలో, ఆలోచనా సరళిలో, స్వభావాల్లో మాకు ఆవగింజంతైన పొత్తు కుదరకపోయినా, కల్లాకపటం లేని నాతో మాట్లాడడమంటే అతనికి మహా ఇష్టం.

ఇవాన్ పెట్రోవిచ్ ఆహార విహారాదుల్లో కూడ మితము పాటించేవాడు. అతని కేవిధమైన విషయ చాపల్యమూ లేదు. అతను తాగి మైమరచి వుండగా నేను చూచిఎరుగను. (మా ప్రాంతంలో ఇది సామాన్య మయిన సంగతికాదు!) పోతే, స్త్రీల విషయంలో

మాత్రం అతను మహా చపలుడు. కాని, అతనికి పెళ్ళి కాని పిల్లకున్నంత సిగ్గుకద్దు. *

మీ జాబులో పేర్కొన్న కథలు కాక, ఇవాన్ పెత్రోవిచ్ రచనలింకా చాలా వున్నాయి. వాటి వ్రాత ప్రతుల్లో కొన్ని ప్రస్తుతం నా స్వాధీనంలో వున్నాయి. మరికొన్ని, అతని పనిమనిషి, ఆ ముసలిది ఇంటి పనులకు వాడుకొంది. ఉదాహరణకు గత సంవత్సరం చలి కాలంలో, ఆమె, ఇంట్లో తను కాపురముండే భాగంలో వున్న కిటికీలకు అంటించడానికై, ఇవాన్ పెత్రోవిచ్ రాసిన నవల మొదటి భాగమంతా ఉపయోగించేసింది. : (ఇవాన్ పెత్రోవిచ్ ఆ నవలను పూర్తి చేయకుండానే కన్ను మూసాడు) మీకు పేర్కొన్న కథలు అతని తొట్టతొలి రచనలని నాకు గుర్తు. ఆ కథలన్నీ జరిగినవేననీ, ఇతరులు చెప్పగా తాను విన్నవనీ పెత్రోవిచ్ రాశాడు. * కాని వాటిలోని పేర్లన్నీ

---

* ఇక్కడ లేఖలో పేర్కొన్న ఒక ఉదంతాన్ని మేము వదలివేశాం – అనవసరమనే అభిప్రాయంతో. కాని ఇవాన్ పెత్రోవిచ్ స్మృతికి కళంకమని చెప్పదగిన విషయాలేమీ అందులో లేవని మేము ఘంటాపథంగా చెప్తున్నాం.

* వాస్తవంలో ఐ. పి. బెల్కిన్ వ్రాత ప్రతిలో ప్రతి కథపైనా, రచయిత స్వహస్తంతో "ఫలానా ఫలానావారు (వారి హోదా, లేక బిరుదు, పొడి అక్షరాలతో పేరు) నాకు చెప్పినది" అని వ్రాయబడిఉంది. ఆ వివరాలుకూడా తెలుసుకోవాలనే

కల్పితాలు. గ్రామాల్నీ, వాటి శివారులూ మా ప్రాంతంనుండి తీసుకొన్నాడు. ఒకచోట మా గ్రామం పేరు కూడా వుంది. తెలియనితనంతప్ప, ఇదేదో దురుద్దేశంతో చేసినపనికాదు.

1828 లో ఆకురాలు కాలంలో ఇవాన్ పెత్రోవిచ్ కి జబ్బుచేసింది. అది క్రమంగా తీవ్ర జ్వరంగా మారి తుదకతన్ని పొట్టబెట్టుకొంది. స్థానిక వైద్యుడు అహోరాత్రులు చేసిన యత్నాలన్నీ వృథా అయి పోయాయి.

అతనేమి సామాన్యుడా? ఘన వైద్యుడు. ముఖ్యంగా ఆనెలూ, ఇలాంటి దీర్ఘవ్యాధులకు చికిత్స చేయడంలో దిట్ట. ఇవాన్ పెత్రోవిచ్ తన ముప్ఫైదవ యేట నా చేతుల్లో ప్రాణాలు విడిచాడు. గొర్యూఖినో గ్రామంలోని చర్చి ఆవరణంలో అతని తల్లిదండ్రుల సమాధుల ప్రక్కనే అతణ్ణికూడ పూడ్చాము.

---

కుతూహల ముండేవారికోసం వాటిని దిగువ ఇస్తున్నాం. 'స్టేషన్ అధికారి' అనే కథ చెప్పినది కౌన్సిలర్ ఎ. జి. యన్. 'గురి కాడు' అనే కథ కర్నల్ ఐ. యల్. పి., 'అంత్యక్రియల నిర్వాహకుడు' అనే కథ షాపు గుమాస్తా బి. వి., 'మంచు తుఫాను', 'పేదవాళ్ళ పిల్లగా మారిన పెద్దింటి అమ్మాయి' అనే కథలు రెండూ కె. ఐ. టి. అనే ఒక యువతి చెప్పారు.

ఇవాన్ పెట్రొవిచ్ అంత పొడగరికాదు, అంత పొట్టికాదు. బూడిదరంగు కన్నులు, బంగారువన్నె వెంట్రుకలు, చక్కని ముక్కు, తెల్లని దేహచ్ఛాయ కలవాడు; బక్కపలుచన మనిషి.

మహాశయా! కీర్తిశేషుడైన నా స్నేహితుని జీవితం, వృత్తి, ఆకారం, ప్రకృతి మొదలగు విషయాలను గురించి నాకు జ్ఞప్తికున్న దింతే. నా యీ లేఖను మీరు ఉపయోగించుకోదలిస్తే, నా పేరు మాత్రం మందులో పేర్కొనవద్దని వినయపూర్వకంగా మీకు విజ్ఞప్తి చేస్తున్నాను. రచయితలంటే నాకు అమితమైన గౌరవం, అభిమానం వున్నప్పటికీ, నేనుమాత్రం మొక రచయితగా నలుగురికంట పడదలచుకోలేదు. నిజంగా ఈ నా వయస్సుకది తగనిపని.

నమస్తే,

ఇట్లు మీ.....

1830 నవంబరు 16;

నెనరదొవో గ్రామం.

మా గ్రంథ స్నేహితుని కోర్కెను గౌరవింపడం ధర్మమని భావించాము. మా కీ సమాచారాన్ని అందించినందు కిదే మా కృతజ్ఞతాంజలులు. ఆయన ఈ రచనలోని చిత్తశుద్ధినీ, సత్యప్రియత్వాన్నీ పాఠకులు అభినందిస్తారని మా విశ్వాసం.

ఎ. పి.



మేము ద్వంద్వయుద్ధం చేశాము.

— *బరాటిన్‌స్కీ* [2]

*ద్వంద్వయుద్ధ ధర్మం ప్రకారమే అతణ్ణి పిస్తోలుతో కాల్చివేస్తానని ప్రతిజ్ఞ చేశాను. (నే నింకా అతని కొక ఏటు బాకీ ఉన్నాను)*

— *ఆరుబయటు మకాంలో ఒకనాడు సాయంత్రం* [3]

# 1

మా పటాలం 'కి' అనే చిన్న పట్టణంవద్ద ఉండేది. సైన్యంలోని ఆఫీసర్ల జీవితం ఎలా వుంటుందో ప్రతి ఒకరికి తెలుసు. ఉదయం లేస్తూనే కవాతు; గుర్రపు

స్వారీ సాధన; మధ్యాహ్నం దళాధిపతి ఇంట్లోనో, లేక ఏ యూదు హోటల్లోనో భోజనం; సాయంత్రం మద్యపానం; పేకాట. ఆ పట్టణంలో మమ్మల్ని ఇంటికి రమ్మని పిల్చే గృహస్థుకాని, పెళ్ళీడతిగిన అమ్మాయి కాని ఒక్కరయినా ఉంటే ఒట్టు. ఎవరో ఒకరి గదిలో తక్కిన వాళ్ళందరం చేరే వాళ్ళం; కాని ఎంతసేపూ ఒకరి యూనిఫారం ఒకరు చూచుకొంటూ కూర్చోవడం తప్ప చూడ్డానికే ముం దక్కడ!

మాలో ఒక్కతనుమాత్రం సైనికోద్యోగి కాడు. అతనికి సుమారు 35 సంవత్సరా లుండవచ్చు. కాని మా దృష్టిలో వయస్సు మీరినవాడనే లెక్క. అతనికున్న అనుభవం మా కెవరికీ లేదు ఇదే అతని కొక్క పెద్దలాభం. అతనెప్పుడూ ఏదో విచారంగా కనపడేవాడు. మనిషి కఠినుడు; నోటి దురుసు ఎక్కువ. ఇవి మా లేత మనస్సులపై చాలా పని చేశాయి. అతనెవరో, ఎక్కడివాడో, అంతా గుప్తంగా ఉండేది. చూడడానికి రష్యా దేశస్థునిలాగా కనపడేవాడు. పేరేమో పరాయివారిది. అతను పూర్వం హుస్సార్ దళంలో ఆఫీసరుగా పని చేశాడు. వృద్ధికి రావడానికి ఎంతో అవకాశముండినవాడు. మరి ఆ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఈ దిక్కుమాలిన ఊరిలో స్థిరపడడానికి కారణమేమో ఎవరికీ తెలీదు. అతని జీవితం చూస్తే

ఇంత లోభీ, ఇంత భోళాశంకరుడు వుండడనిపిస్తూంది. ఒక చింపిరి లాంగ్ కోటు తొడుక్కొని ఎక్కడికి వెళ్ళినా నడిచే వెడతాడు. అతని ఇల్లు పటాలంలోని ఆఫీసర్లందరికి సొంత ఇల్లున్నట్టే. అయితే ఆయన ఇంట్లో భోజనమంటే, ఒక మాజీ సైనికుడు వండే ఏ రెండూ మూడో వంటకాలే కావచ్చు; కాని మద్యం మంచినీళ్ళలా ప్రవహించేది. అతని ఆస్తి ఎంతో, రాబడి ఎంతో ఎవరికీ తెలీదు. ఈ విషయాలు అతణ్ణడిగే ధైర్యమూ మాలో ఎవరికీ లేదు. అతనివద్ద చాలా పుస్తకాలుండేవి. వీటిలో ఎక్కువ భాగం నవలలూ; యుద్ధతంత్రాన్ని గురించిన రచనలూ. ఈ పుస్తకా లడిగిందేతడవుగా ఇచ్చివేసేవాడు. మళ్ళీ ఇమ్మని అడిగేదీ లేదు. అయితే తాను యితరులనుంచి తెచ్చుకొన్న పుస్తకాల విషయంలో కూడ అంతే. మళ్ళీ వాళ్ళవి వాళ్ళకిచ్చే పద్ధతి లేదు. అతని ప్రధాన వ్యాసంగం పిస్తోలుతో కాల్చడం. అతని గదిగోడలు పిస్తోలుగుళ్ళవల్ల ఏర్పడిన రంధ్రాలతో నిండి తేనె తెట్టెలావుండేవి. ఆమంటి కొంపలో విలాసవస్తువులనదగినవి అతను సేకరించిన రకరకాల పిస్తోళ్ళే. పిస్తోలు సాధనలో అతనెంత సిద్ధహస్తుడంటే, ఎవరి తలమీదనైనా ఒక చిన్న నేరేడు పండుంచి దాన్ని గురిచూచి కొట్టనా ? అని అతనడిగివుంటే, తనతల అతని కప్పజెప్పటానికి సంకోచించే వాడొక్కడు లేడు మా పటా

లంలో. మా సంభాషణ పలుమారు ద్వంద్వయుద్ధాలపై మళ్ళేది. కాని అలాంటిసమయాల్లో సిల్వియో (ఇకమీాద అతణ్ణిసిల్వియో అని పేర్కొంటాను) మా సంభాషణలో పాల్గొనేవాడు కాదు. ఎప్పుడైనా 'నీవు ద్వంద్వయుద్ధం చేశావా ?' అని అడిగితే, 'చేశాను' అని ముక్తసరిగా సమాధాన మిచ్చి పూరికునేవాడు. ఇలా అడగడం అతనికి సరిపోదని స్పష్టంగా కనపడేది. బహుశా, భయం కరమైన ఈ నేర్పుకు బలియైన ఏ అభాగ్యుని స్మృతులో అతని అంతరాత్మను వేధిస్తున్నాయని మేము నిశ్చయించుకొన్నాం. అతడు పిరికివాడేమో అనే అనుమానం మాకెన్నడూ రాలేదు. కొంతమంది మనుషులను చూస్తే చాలు, అటువంటి అనుమానాలు దరిదాపులకే రావు.

ఒకరోజు పదిమంది ఆఫీసర్లం సిల్వియో ఇంట్లో భోజనం చేస్తూన్నాం. అంతా మామూలులాగానే తాగాం; అంటే మస్తుగా తాగామన్నమాట. భోజనం తరువాత పేకాడుదాం రమ్మని సిల్వియోను బ్రతిమాలాం. కాని, అతను ఒప్పుకోలేదు. అతను చీట్లపేక ఆడడం చాలా అరుదు. కాని బ్రతిమాలగా, బ్రతిమాలగా చాలాసేపటికి చీట్లపేక తెప్పించి, మేజాపై యాభై పది రూబుళ్ళ నోట్లను ముందర పరచుకొని ఆకులు పంచడం ప్రారంభించాడు. మేమంతా చుట్టూ మూగాం; ఆట ప్రారంభమయింది. పేకాట జరుగుతూన్నంత సేపూ

బెల్లంకొట్టిన రాయిలా మౌనంగా ఉండడం సిల్వియోకు అలవాటు. ఆటపై వాదప్రతివాదాలూ, వ్యాఖ్యానాలూ చేయడు. పందెం ఒడ్డినవాడు పొరపాటు చేస్తే, సిల్వియో వెంటనే డబ్బు చెల్లించడమో లేక మిగులు మొత్తం లెక్క వ్రాయడమో చేసేవాడు. మాకందరికది బాగా తెలుసు. కాబట్టి అతని నిబంధనలకు మేమడ్డం చెప్పేవాళ్ళం కాదు. కాని మాలో కొన్నిరోజుల క్రితమే మా పటాలానికి బదిలీఐన ఒక ఆఫీసరుకూడా ఆనాడున్నాడు. అతను ఆట మధ్యలో, పరధ్యానంగా, పందెం ఒక రూపాయంటూ హెచ్చించాడు. సిల్వియో వెంటనే చాక్ పీసు తీసుకొని స్కోరు దిద్దాడు. సిల్వియో పొరబడ్డాడనుకొని ఆ ఆఫీసరు అదిగాదిదని వ్యాఖ్యానాలు ప్రారంభించాడు. కాని సిల్వియో మాటుపలుకూ లేకుండా, ఆట సాగిస్తున్నాడు. ఆఫీసరుకు చిరాకు కలిగింది. బ్రష్ తీసుకొని, సిల్వియో పొరపాటుగా వేశాడనుకొన్న అంకె తుడిచివేశాడు. సిల్వియో చాక్ పీసుతో మళ్ళీ ఆ అంకె వేశాడు. మద్యమూ, సహచరుల నవ్వులూ, జూదమూ వీటన్నిటితో ఆఫీసరు రక్తం వేడెక్కింది. తనకు ఘోరమయిన అవమానం జరిగిందనుకొని, మేజాపై వున్న ఇత్తడి దీపపు సెమ్మె అందుకొని, సిల్వియోపై చేతికొద్దీ విసిరాడు. సిల్వియో నెంట్రుకవాసిలో ఏటు తప్పించుకొన్నాడు. మేమంతా నిర్విణ్ణులమై కూర్చొ

న్నాం. రోషావేశంవల్ల వివర్ణమైన ముఖంతో, నిప్పు లిమిసేకళ్ళతో సిల్వియో పైకి లేచాడు.

"దయచేసి ఇక్కడ నుంచి వెళ్ళు! ఇది నా ఇంట్లో జరిగినందుకు సంతోషించు."

దీని పరిణామమేమిటో మాకు స్పష్టంగా తెలుసు. కొత్తగా వచ్చిన ఆఫీసరు చచ్చినవాడి క్రిందే లెక్క- వేశాం. తాను సిల్వియోకు చేసిన అవమానానికి జవాబు చెప్పుకోనేందుకు సిద్ధంగా ఉన్నాననీ, అతని కెప్పుడు అనుకూలంగా ఉంటే అప్పుడు కబురు చెప్పి పంపవచ్చుననీ, అంటూ ఆఫీసరు వెళ్ళిపోయాడు.

తరువాత కొన్ని నిమిషాలు పేకాట కొనసాగింది. కాని, సిల్వియో మనస్సు ఆటలపై లేదని మాకు తోచింది. ఒకరొకరమే అక్కడనుంచి జారు కొని, మా పటాలంలో ఏర్పడబోయే ఖాళీని గురించి చర్చించుకొంటూ మా మకాం చేరుకొన్నాం.

మరునటి రోజు అశ్విక శిక్షణాలయంలో, పాపం లెఫ్టినెంటు గతి ఏమయిందో ఎవరికైనా తెలుసా అని మేము ఒకరినొకరు ప్రశ్నించుకొంటూ వుండగా, హఠాత్తుగా అతనే ప్రత్యక్షమయ్యాడు. ఏమిటి సంగతని అతి న్నడిగితే, సిల్వియో నుండి తనకు కబురు రాలేదన్నాడు. సిల్వియో ఇంటికే వెళ్ళాం. తరువాత అతను తన ఇంటి

గేటుకు ఒక ఆసుముక్కను చెక్కి, దాని నట్టనడుమ గురిచూచి కొడుతూ కూర్చున్నాడు. మేము కనిపించ గానే, రమ్మని మామూలుగానే మాట్లాడాడు. రాత్రి జరిగిన సంగతిగూర్చి అతనినుండి ఒక్కమాట రాలేదు. తరువాత మూడురోజులు గడిచాయి. లెఫ్టినెంటు బ్రతికే వున్నాడు. సిల్వియో లెఫ్టినెంటును ద్వంద్వయుద్ధానికి రమ్మని సవాలుచేయడా ఏమి? అని ఆశ్చర్యంతో ఒకరినొకరు ప్రశ్నించుకొన్నాం. కడకు సిల్వియో అతనితో కలపడలేదు. కాస్త క్షమాపణతోనే సరిపెట్టు కొని, లెఫ్టినెంటుతో రాజీపడ్డాడు.

దీనితో పటాలంలోని ఆఫీసర్లకు సిల్వియో పైన ఉండే గౌరవం తగ్గిపోయింటుం దనుకొంటా. ఇతర విషయా లెలావున్నా, సిరికతనాన్ని మాత్రం యువకులు క్షమించరు. వారి దృష్టిలో ధైర్యం అన్ని పాపాలను కప్పివేసే మహోత్కృష్టమైన సుగుణం. కాని కొన్ని రోజులయిన తరువాత ఈ సంఘటన అందరూ మరచిపోయ్యారు. సిల్వియో మా బృందంలో పూర్వ ప్రాబల్యాం సంపా దించాడు.

నేను మాత్రమే అతణ్ణి మునుపటిలా చూడలేక పోయాను. మధురవూహాలతో స్వప్న జగత్తు సృష్టించు కొనే స్వభావంనాది. అందువల్ల అంతరికి అయో మయంగావున్న సిల్వియోను ఎవరెరుగని ఒక రహస్య

కథానాయకుడుగా మనస్సులో చిత్రించుకొన్నాను. ఈ కారణంగా అతనంటే ఇష్టంకన్న నాకు అభిమాన మెక్కువ – అతనూ నన్నంతో ప్రియంగా చూసేవాడు. కనీసం, నా ఒక్కడితోనే అతను తన వికటపు ధోరణి మాని నిష్కపటంగా, ఆప్యాయంగా మాట్లాడేవాడు. సిల్వియో ఆత్మగౌరవానికి మచ్చగా నిల్చిపోయిన ఆనాటి సంఘటనలు నాస్మృతి పథంనుంచి తొలగిపో నందువల్ల, నేనతణ్ణి మునుపటిమాదిరి చూడలేక పోయాను. అతని కళ్ళలోకి చూడడానికే నాకు సిగ్గువేసేది. సూక్ష్మగ్రాహీ, అనుభవజ్ఞుడూ అయిన సిల్వియో ఇది గమనించకపోలేదు. కారణమూ ఊహించాడు. ఇది అతని మనస్సుకు చాలా బాధకలిగించివుంటుంది. అతను తన హృదయంవిప్పి నాతో మాట్లాడాలని వున్నట్లు నా కొకటి రెండుసార్లు కనపడింది. కాని నే నందుకవకాశం ఇవ్వకుండా తప్పించుకొన్నాను. అంతటితో సిల్వియో ఊరకయ్యాడు. అప్పటినుంచి నేను తోటి ఉద్యోగు లెవరైనా వెంట వున్నప్పుడే అతణ్ణి కలుసుకొనేవాణ్ణి. కాబట్టి మునుపటిలా, హృదయాలు విప్పి పరస్పరం మాట్లాడుకోవడం ఆగిపోయింది.

పల్లెపట్టుల్లో, మారుమూల పట్టణాల్లో నివసించే వారి జీవితంలోని అనుభూతు లనేకం వినోద విలాసాల్లో మునిగి తేలే మహానగరవాసులు ఊహిం

చుకోలేను. ఉదాహరణకు తపాలు వచ్చే రోజుకోసం ఎదురుచూడడం అదొక అనుభవం. అది నగరవాసుల ఊహ కందదు. ప్రతి మంగళవారం, శుక్రవారం, మా సైనికదళ కార్యాలయం, ఎప్పుడూ డబ్బుకోసమో, ఉత్తరాలకోసమో, లేక వార్తాపత్రికలకోసమో కాచు కొని కూర్చున్న ఆఫీసర్లతో క్రిక్కిరిసి వుండేది. వచ్చిన ఉత్తరాలు చేతికందిందే తడవుగా, చింపి చదువుకొని ఒకరి సమాచార మొకరికి చెప్పుకోవడంతో కార్యాలయమంతా కోలాహలంగా ఉండేది. తన జాబులు కూడా మా పటాలంద్వారానే తెప్పించుకొంటున్నందు వల్ల సిల్వియో కూడా అప్పుడక్కడ ఉండేవాడు. ఒక రోజు ఆయన కొక వుత్తరం వచ్చింది. అది చేతికందీ అందడంతోనే, మహా ఆత్రంగా, సీలు నగులగొట్టి, మొగమంతా కళ్లుచేసుకొని జాబు చదువుకో నారంభిం చాడు. ఎవరి టపాలు వాళ్ళు చూచుకొంటూ ఇదెవరూ గమనించలేదు. సిల్వియో కంఠ మెత్తి "ఒక మాట! ఇలా వినండి. నేను ఇక్కడనుండి వెంటనే వెళ్ళిపోవాలి: ఈ రాత్రే పడుతున్నాను. మీరంతా వచ్చి తుదిసారి నాతో కలిసి భోజనం చేయాలి. ఎవరూ కాదనడానికి వీలులేదు" అని నా వైపు తిరిగి "నీవు వస్తావుకదూ? వచ్చి తీరాలి" అని చరచర గది నుండి వెళ్ళిపోయాడు. మళ్ళీ సిల్వియో ఇంట్లో కలుసు

కొందామని కలిసి మాట్లాడుకొని ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయ్యాం.

టైముకు సరిగ్గా నేను సిల్వియో ఇంటికి వెళ్ళాను. అప్పటికే పటాలంలోని ఆఫీసర్లంతా అక్కడ జమయ్యారు. సిల్వియో సామానంతా కట్టివేయడం అయిపోయింది. పిస్తోలు గుండ్లతో బొక్కలు పడిన బోడిగోడలుమాత్రమే మిగిలాయి.

భోజనానికి కూర్చున్నాం...మా గృహస్థు మహా ఉత్సాహంగా వున్నాడు. అతని ఉత్సాహం అతిధులను కూడ ఆవరించింది. క్షణానికొక సీసా బిరడా ఎగిరి పోతోంది. గ్లాసుల్లో మధువు బుసబుసలు పోతోంది. ప్రయాణానికి సిద్ధంగావున్న గృహస్థుకు ఎన్నిసారులు గ్లాసులెత్తి శుభాకాంక్షలు తెలియజేసామో, సుఖంగా వెళ్ళి రమ్మని వీడ్కోలిచ్చామో లెక్కలేదు. మేము భోజనాల నుండి లేచేసరికి చాలా పొద్దుపోయింది. మా టోపీలు తెచ్చుకునే టప్పుడు సిల్వియో మాత్రం ప్రతి ఒకరితోను వేరువేరుగా శలవు తీసుకొన్నాడు. నేనతన్ని వీడ్కొని వెళ్ళబోతున్న సమయంలో సిల్వియో నాచేయిపట్టి నిలిపి, "నీతో మాట్లాడాలి" అని మెల్లగా అన్నాడు. నేను వెనుకనే ఆగాను.

వచ్చిన అతిధులందరు వెళ్ళిపోయారు. మే మిద్దరమే మిగిలాం. మా పైపులను ముట్టించి మౌనంగా

ముఖాముఖిని కూర్చున్నాం. సిల్వియో ఏదో ఆలోచనా నిమగ్నుడై వున్నాడు. కొన్ని నిమిషాల క్రితం అతనిలో పొంగారిన ఆనందోత్సాహాల జాడ అతని ముఖంలో ఎక్కడా కనిపించడంలేదు. విషాదంతో పాలిపోయిన ఆ మొగం, నిగనిగ మెరిసే ఆ కళ్లు, నోటినుండి కొలిమిలో లాగ వెలువడుతున్న ఆ పొగలు చూస్తే, సిల్వియో ఒక భూతంలా కనపడుతున్నాడు. గది అంతా నిశ్శబ్దంగా ఉంది. కొన్ని నిమిషాలలా గడిచాయి. తుదకు సిల్వియో యిలా అన్నాడు :

"బహుశా మనం మళ్ళీ ఈ జన్మలో కలుసుకోము. మనం విడిపొయ్యే ముందు నీకు కొన్ని విషయాలు చెప్పాలని ఉంది. నన్ను గురించి ఎవరేమను మనుకున్నా, నేను లెక్క చేసేవాణ్ణి కాదని నీకు తెలుసు. కాని నీవు నాకు యిష్టుడువి. నన్ను గురించి ఒక అపోహతో నీవు వెళ్ళిపోతే, నా మనస్సుకు కష్టంగా వుంటుంది."

సిల్వియో కొంతసేపాగి తన పైపును నింపుకోవడం ప్రారంభించాడు. నేను మౌనంగా నేలవైపు చూస్తూ కూర్చున్నాను.

"తప్పతాగిన ఆ వెధవకు నేను శాస్తి చేయక పోవడం నీకు విచిత్రంగా కనిపించిందికదూ !" అని మళ్ళీ చెప్ప నారంభించాడు.

"ఏ ఆయుధాలతో ఇద్దరమూ తలపడాలో నిర్ధారణచేసే హక్కు నాకుంది. కాబట్టి వాడి ప్రాణాలు నా అరచేతిలో ఉన్నాయి. నా ప్రాణానికి వచ్చిన భయం ఏమీ లేదని నీకు తెలుసు. కాబట్టి నేను శాంతం వహించడానికి నా ఉదారబుద్ధే కారణమని ఎవరైనా ఊహించడానికి ఆస్కారముంది. అలానే అనుకోనీ లెమ్మని నేను వూరికే ఉండవచ్చుకూడ. కాని నిన్ను మోసం చేయడం నాకిష్టంలేదు. నా ప్రాణాలకు లవలేశం కూడ అపాయం కలుగకుండా వాణ్ణి శిక్షించడానికి వీలుంటే, నేను రా......నుక్షమించి వుండను."

నేను మహదాశ్చర్యంతో రెప్ప వాల్చకుండా సిల్వియో వైపు చూచాను. ఇలా అతను ఒప్పుకోవడం నాకు దిగ్భ్రమ కలిగించింది. సిల్వియో మళ్ళీ చెప్ప నారంభించాడు. "అవును నా ప్రాణానికి ఈషణ్మాత్రమైనా అపాయం కలిగే పనిచేసే హక్కు నాకు లేదు. ఆ రేండ్ల క్రిందట ఒకడు నా ముఖంపై ఛళ్ళీమని వాయించాడు. ఆ నా శత్రువు వింకా బతికే వున్నాడు."

నా ఉత్కంఠ పురి విప్పింది.

"నీ వతనితో తలపడ లేదన్నమాట?" అని అడిగాను.

"ఏవో అభ్యంతరాలు వచ్చి, మీరు విడిపోవలసి వచ్చిందనుకుంటాను."

"అతనితో తలపడ్డాను. మా ద్వంద్వయుద్ధ స్మృతి చిహ్నం నా వద్ద వుంది."

సిల్వియో లేచి ఒక అట్టపెట్టెనుంచి ఒక ఎర్రని సట్టుటోపీని (ఫ్రెంచివారి పోలీసుటోపీ లాంటిది) బయటికి తీసి తలపై పెట్టుకొన్నాడు. అతని పాలభాగానికి ఒక అంగుళంపైన టోపీలో పిస్తోలుగుండు దూసుకొనిపోయిన రంధ్రమొకటి వుంది.

సిల్వియో యిలా కొనసాగించాడు. "నేను '...' వహుస్సార్ల దళంలో వున్న విషయం నీకు తెలుసు. నా స్వభావం నీకు కొత్తకాదు. ప్రతిదాంట్లోను అందరి కన్నా నాదే పై చేయిగా ఉండటానికి అలవాటుపడ్డాను. నా చిన్నతనంలో నా సరదొక పిచ్చిగా వుండేది. మా కాలంలో పోకిరితనం ఒక ఫాషన్. మా పటాలంలో నా అంత పోకిరీ లేడు. సారా తాగడం ఒక గొప్పగా భావించేవాళ్ళం. నేనొకసారి మేజాకింద, ప్రఖ్యాత కవి డెనిస్ దవిదోవ్ కీర్తించిన బుల్ స్టోవ్ ను తాగివేశాను. మా పటాలంలో ద్వంద్వయుద్ధాలు జరగని నిమిషమంటూ లేదు. నేను యించుమించు ప్రతిదాంట్లోను ఏదో ఒక రిఫరీ పెద్దమనిషిగానో లేక ప్రతిద్వంద్విగానో పాల్గొనే వాణ్ణి. నా మిత్రులు నాకు బ్రహ్మరథం పట్టేవారు. నిరంతరమూ బదిలీ అవుతూన్న దళాధిపతులు నన్ను వదలించుకోవడానికి వీలులేని శనిగ్రహంలాగా చూచేవారు.

"ఏ ఆయుధాలతో ఇద్దరమూ తలపడాలో నిర్ధారణచేసేహక్కు నాకుంది. కాబట్టి వాడి ప్రాణాలు నా అరచేతిలో ఉన్నాయి. నా ప్రాణానికి వచ్చిన భయం ఏమీ లేదని నీకు తెలుసు. కాబట్టి నేను శాంతం వహించడానికి నా ఉదారబుద్ధే కారణమని ఎవరైనా ఊహించడానికి ఆస్కారముంది. అలానే అనుకోనీ లెమ్మని నేను వూరికే ఉండవచ్చుకూడ. కాని నిన్ను మోసం చేయడం నాకిష్టంలేదు. నా ప్రాణాలకు లవలేశం కూడ అపాయం కలుగకుండా వాణ్ణి శిక్షించడానికి వీలుంటే, నేను రా ......నుక్షమించి వుండను."

నేను మహదాశ్చర్యంతో రెప్ప వాల్చకుండా సిల్వియో వైపు చూచాను. ఇలా అతను ఒప్పుకోవడం నాకు దిగ్భ్రమ కలిగించింది. సిల్వియో మళ్ళీ చెప్ప నారంభించాడు. "అవును నా ప్రాణానికి ఈషణ్మాత్రమైనా అపాయం కలిగే పనిచేసే హక్కు నాకు లేదు. ఆరేండ్ల క్రిందట ఒకడు నా ముఖంపై ఛళీమని వాయించాడు. ఆ నా శత్రు వింకా బతికే వున్నాడు."

నా ఉత్కంఠ పురి విప్పింది.

"నీ వతనితో తలపడ లేదన్నమాట?" అని అడిగాను.

"ఏవో అభ్యంతరాలు వచ్చి, మీకు విడిపోవలసి వచ్చిందనుకుంటాను."

"ఆనందంతో తెలుపుతాను. మా ద్వంద్వయుద్ధ స్మృతి చిహ్నం నా వద్ద వుంది."

సిల్వియో లేచి ఒక అట్టపెట్టెనుంచి ఒక ఎర్రని పట్టుటోపీని (ఫ్రెంచివారి పోలీసుటోపీ లాంటిది) బయటికి తీసి తలపై పెట్టుకొన్నాడు. అతని ఫాలభాగానికి ఒక అంగుళంపైన టోపీలో పిస్తోలుగుండు దూసుకొనిపోయిన రంధ్రమొకటి వుంది.

సిల్వియో యిలా కొనసాగించాడు. "నేను '...' వహుస్సార్ దళంలోవున్న విషయం నీకు తెలుసు. నా స్వభావం నీకు కొత్తకాదు. ప్రతిదాంట్లోను అందరికన్నా నాదే పై చేయిగా ఉండటానికి అలవాటుపడ్డాను. నా చిన్నతనంలో నాకది పిచ్చిగా వుండేది. మా కాలంలో రౌడీతనం ఒక ఫాషన్. మా పటాలంలో నా అంత పోకిరి లేడు. సారా తాగడం ఒక గొప్పగా భావించేవాళ్ళం. నేనొకసారి మేజాకింద, ప్రఖ్యాత కవి డెనిస్ దవిదోవ్ కీర్తించిన బుల్‌స్టోవ్‌ను తాగివేశాను. మా పటాలంలో ద్వంద్వయుద్ధాలు జరగని నిమిషమంటూ లేదు. నేను యించుమించు ప్రతిదాంట్లోను ఏదో ఒక రిఫ్రీ పెద్దమనిషిగానో లేక ప్రతిద్వంద్విగానో పాల్గొనేవాణ్ణి. నా మిత్రులు నాకు బ్రహ్మరథం పట్టేవారు. నిరంతరమూ బదిలీ అవుతూన్న దళాధిపతులు నన్ను వదలించుకోవడానికి వీలు లేని శనిగ్రహంలాగా చూచేవారు.

ఇలా పేరు సంపాదించినందుకు నా మనస్సుకు నెమ్మదిగా ఉంది – అంతే నెమ్మదిగా కాలం గడచిపోను గాదు. ఇలా ఉండంగా ఒక ఉన్నత కుటుంబానికి చెందిన యువకుడొకడు, మా పటాలంలో చేరాడు. అతని పేరు చెప్పను. అంత ప్రజ్ఞావంతుణ్ణి, అదృష్టజాతకుణ్ణి నేను జన్మలో చూడలేదంటే నమ్మ, సాహసం, సౌందర్యం, అల్లరి, మందహాసం, అభిజాత్యం, అంతు లేని డబ్బు, ఆడబ్బును నీళ్ళప్రాయంగాచూచే తెంపరా – ఈ లక్షణాలుండే యువకుణ్ణి నీ మనసులో చిత్రించుకోగా, మా పటాలంలో వీని ప్రభావం ఎలా వ్యాపించిందో ఊహించు. నా పేరు మసకబడే పరిస్థితి ఏర్పడింది. సైన్యంలో నాకుండే పేరు ప్రఖ్యాతులు వాణ్ణి ఆకర్షించాయి. నాతో స్నేహంచేయాలని చూచాడు. కాని నేనందుకు అవకాశం ఇవ్వ లేదు. [illegible] ఆ ప్రయత్నం మానుకొన్నాడు. అతనిపైన నాకు విపరీతమైన ద్వేషం పుట్టింది. తోటివాళ్ళూ, ఆడవాళ్ళూ, అతనంటే పడిచచ్చేవారు. ఇది చూచి నాఒళ్ళు దహించుకొనిపోయేది. అతనితో గిల్లి కజ్జాపెట్టుకుందామని చూచాను. నేను పరిహాసంచేస్తే అతనూ పరిహాసాలతోనే సమాధానమిచ్చేవాడు. కాని ఇందులో కూడ అతనిదే పైచేయిగ ఉన్నట్టు తోచింది. నా మాటల్లోకన్నా అతని మాటల్లో ఒక నవ్యతా, నేర్పూ ఉన్నట్టు నాకు

కనిపించేది. నాకన్న తమాషాగా మాట్లాడేవాడనేది వాస్తవం.

అతను వేళాకోళానికి మాట్లాడితే, నా విసుర్లు, విష లిప్తమయిన బాణాల్లాగా వుండేవి. ఒకనాడు సాయంత్రం ఒక పోలిష్ జమీందారింట్లో విందు జరుగుతూ ఉంది. నర్తకశాలలో గుమిగూడిన యువతుల చూపులన్నీ అతనిపై వున్నాయి. ఇంటి యజమానురాలు అతన్ని క్షణంకూడా వదలడం లేదు. ఆమెకూ నాకూ రహస్యంగా సంబంధంకూడా. నాకు శివమెత్తినట్లయింది. వెళ్ళి అతని చెవిలో రెండు బూతులు తిట్టాను. అతని మొగం జేవురించింది. ఛళీమని నా మొగంపై కొట్టాడు. క్షణంలో మా చేతులు ఒరలపైకి పోయాయి. కొందరు స్త్రీలు మూర్ఛపోయ్యారు. చుట్టూ పోగయిన జనం మమ్మల్ని బలవంతంగా విడిపించారు. సరే. ఆ రాత్రే, అమీ తుమీ తేల్చుకోవాలని అక్కడనుండి బయలుదేరి వెళ్ళాం.

అప్పటికి తెల్లవారు జామయి వుంటుంది. ముగ్గురు పెద్దమనుషులతో నేను నిర్ణీతస్థలం చేరుకొన్నాను. పగవాడికోసం ఎదురుచూస్తూ నిలబడ్డాం. అది వసంత కాలం. త్వరగా పొద్దు పొడిచి, ఎండెక్కింది. ఇంతలో దూరంలో వస్తున్న అతను కనిపించాడు. తన తరఫున ఒక పెద్దమనిషిని వెంటపెట్టుకొని నడిచే వస్తున్నాడు. మేము

వాళ్ళకు ఎదురు వచ్చాం. టోపీ చేత్తో పట్టుకొని అతను సమీపించాడు. టోపీనిండా చెర్రీ పళ్ళున్నాయి.

మొదట కాల్చ వలసింది నేను. నాకు కోపంతో నా దేహం ఆపాదమస్తకం కంపిస్తున్నది. నా చేయి వణకకుండా వుంటుందనే నమ్మకం నాకు లేదు. అందుకని మొదట అతనే కాల్చవచ్చునని చెప్పా. కాని అతను ఒప్పుకోలేదు. తుదకు చీట్లు వేయాలని నిర్ణయించాం. అదృష్టదేవత వెన్ను దట్టి పుట్టినవాడు! అతని పేరే వచ్చింది. సరే పిస్తోలు ఎక్కుపెట్టి కాల్చాడు. గుండు నా టోపీగుండా దూసుకొనిపోయింది. ఇక నా వంతు. తుదకు. అతని ప్రాణాలన్నీ నా చేతిలో వున్నాయి. అతనిలో అణుమాత్రమైనా ఆందోళన కనపడుతుందేమో నని అతనివైపు పరీక్షగా చూచాను. టోపీలోని మంచి మంచి పళ్ళను ఏరుకొని తింటూ నా పిస్తోలుకు అభిముఖంగా నిల్చొని ఇత్తనాలు ఉమ్మివేస్తుంటే, అవి వచ్చి నా దగ్గర పడుతున్నాయి. అతని నిర్లిప్తత చూచి నా ఒళ్లు మండింది. ప్రాణంపై తీపి లేనివాణ్ణి చంపి ప్రయోజన మేమి? ఒక పాపిష్టి ఆలోచన మెరుపులా తట్టింది. చేతనున్న పిస్తోలు దించివేసి ఇలా అన్నాను.

“మృత్యువును గురించి ఆలోచించడానికికూడా నీకు తీరిక వున్నట్లు తోచదు. నీ తిండికి భంగం కలిగించడం నా కిష్టం లేదు”

"నీవల్ల నా పనికేమీ భంగంలేదు. దయచేసి నీ పని కానీ. నీ కిష్టం లేకపోతే విడిచిపెట్టు. నీవు నాకొక పేసు బాకీ. నీ కిష్టమయినప్పుడు తీర్చుకో."

పెద్ద మనుషులవైపు తిరిగి ప్రస్తుతం కాల్చదలచుకో లేదని చెప్పాను. అంతటితో ద్వంద్వయుద్ధ మయిపోయింది.

నేను సైన్యంలో నా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఈవూరికి వచ్చివుంటున్నా. అప్పటి నుంచి నేను నాశత్రువుపై పగతీర్చుకొనే విషయమై ఆలోచించని రోజు లేదు. ఆ సుముహూర్తం ఆసన్నమయింది."

సిల్వియో ఉదయం వచ్చిన జాబును జేబునుండి బయటికి తీసి చదవమని నా కందించాడు. ఎవరో (బహుశా అతని వకీలై వుండాలి.) మాస్కోనుండి రాసిన ఉత్తరమది. ఒకానొకవ్యక్తి త్వరలో ఒక చక్కని అమ్మాయిని పెళ్ళిచేసుకొనబోతున్నట్లు అతను రాశాడు.

సిల్వియో మళ్ళీ అన్నాడు. "ఈ వ్యక్తిఎవరో నీవు ఊహించుకొనే వుంటావు. నేను మాస్కో వెడుతున్నాను. పూర్వం చెర్రీ పండ్లుతింటూ మృత్యువును ఎంత నిర్లక్ష్యంగా ఎదుర్కొన్నాడో పెళ్ళి చేసుకొనేముందు గూడ అంత నిర్లక్ష్యంగా ఎదుర్కొంటాడేమోచూస్తాం"

ఇలాఅని సిల్వియో లేచినిలబడి, టోపీ నేలకు విసరికొట్టి గదిలో ఇటూఅటూ పచారుచేయ నారంభిం

చూడు, బోనులో చిక్కిన పెద్దపులిలా. నేను స్థాణువునై వింటూనిల్చున్నాను. నా గుండెలో పరస్పర విరుద్ధ మైన భావాలు కొట్టుమిట్టాడుతున్నాయి.

నౌకరు గదిలోనికి వచ్చి గుర్రాలు సిద్ధంగా వున్నాయని చెప్పాడు. సిల్వియో ప్రేమపురస్సరంగా నా చేయి తనచేతిలో ఒత్తి పట్టుకున్నాడు. ఒకరినొకరం కౌగలించుకొన్నాం.

అతనికోసం బయట గుర్రపు బగ్గీ కాచుకొని ఉంది. అందులో రెండు పెట్టెలున్నాయి. ఒకదాని ఆతని సామానులుండేది. పిస్తోళ్ళ పెట్టె రెండోది. మరొక సారి మేము ఒకరితో ఒకరు సెలవు తీసుకొన్నాం. గుర్రాలు దౌడుతీశాం.

## 2

కొన్నేళ్లు గడిచాయి. నా యింటి పరిస్థితులవల్ల నేనుప...జిల్లాలోని ఒక కుగ్రామంలో కాపురం పెట్టవలసి వచ్చింది. నా భూమీ పుట్రా చూచుకోవడంలో పూర్తిగా నిమగ్నమయి వున్నా. కాని పనిమందితో కలిసి అల్లరిగా తిరుగుతూ గడిపిన రోజులను తలచుకొని ఎన్నోసార్లు నిట్టూర్చేవాణ్ణి. హేమంత – శైశిర సాయం

సమయాలు ఒంటరిగా గడపడం అన్నిటికన్నా నాకు దుర్భరంగా వుండేది. భోజనం సమయంవరకు గ్రామపెద్దతో మాట్లాడుతూనో, నా ఎస్టేటులో ఏదెలా జరుగుతూవుందో చూస్తూ తిరుగుతూనో, లేక కొత్తగా ప్రారంభించిన పరిశ్రమలు సందర్శిస్తూనో - ఏదో ఒక విధంగా కాలహరణం చేసేవాణ్ణి. కాని చీకటి పడగానే ఏం చేయాలో నాకు నిక్కు తోచేదికాదు. ఇంటిలో నాకు దొరికే పుస్తకాలన్నీ కంఠోపాఠమయినాయి. నా ఇంటి పనులుచూచే కిరిలోవ్నా చెప్పే కథలన్నీ ఏనాడో విన్నాను. బయటనుండి వినవచ్చే స్త్రీల పాటలు నన్ను ఒక విధమైన విషాదసాగరంలో ముంచివేసేవి. సారాయి తాగితే నాకు తలనొప్పివచ్చేది. లేకపోతే, ఈ పరిస్థితుల్లో నాకు తాగుడు అలవాటయివుండేది. ఇదికాక, ఉబుసుపోకకు తాగుబోతైపోతానేమోననే భయంకూడ నన్ను పట్టుకొందని చెప్పాలి. తాగుబోతుల్లో ఇంతకన్నా నికృష్టులుండరు. ఇలాంటివారు మా జిల్లాలో చుట్టుపట్ల అనేకులున్నారు. నా పక్క ఎస్టేటుదారిలాంటి నిర్భాగ్యుడే. ఎక్కిళ్ళు, నిట్టూర్పులూ తప్ప అతనినోటినుండి ఇతరం నేను విని యెరుగను. ఇలాంటివారి సహవాసంకన్న ఏకాంతమే మేలనిపించేది.[5]

మా గ్రామానికి సుమారు మూడు మైళ్ళ దూరంలో కౌంటెస్ 'బి......' ఎస్టేటు వుంది.

కాని ఎస్టేటు మేనేజరు తప్ప ఇంక వారెవరు అక్కడ వుండరు. తనకు పెళ్ళయిన మొదటి సంవత్సరంలో కౌంటెస్ తన ఎస్టేటుకువచ్చి నెల తిరగకుండానే వెళ్ళిపోయిందట. ఆతరువాత ఆమె ఎన్నడూ ఈప్రాంతం తిరిగి చూడలేదు. నేను పల్లెకువచ్చి ఏకాంతవాసం ప్రారంభించిన మరుసటి సంవత్సరం వసంతఋతువులో కౌంటెస్, భర్తతో కలసి ఎస్టేటుకు వస్తున్నదనే వదంతి బయలుదేరింది. జూలై నెలాఖరుకు వారురానేవచ్చారు.

ఒకసంపన్న గృహస్థురాక గ్రామీణుల జీవితంలో ఒక నూతన శకారంభంతో సమానం. అతను రాక ముందు మూడు నెలలూ, వచ్చివెళ్ళిన తరువాత మూడేండ్లు అతని మాటతప్ప వేరే సుద్దివుండదు, ఆ చుట్టుపట్టుండే భూస్వాములకూ, వారి దాసదాసీ జనానికీ.

ఒక చక్కని యువతి మాప్రాంతానికి వస్తున్న వార్తవిని నాకు ప్రాణం లేచివచ్చినట్లయింది. ఆమె వచ్చిన మరుసటి ఆదివారమే, భోజనమయిన తరువాత ఆత్రంగా సి......గ్రామానికి బయలుదేరాను. "నేను పొరుగువాణ్ణి" అని వాళ్ళకు నన్ను నేను పరిచయం చేసుకోవాలని నా ఉద్దేశ్యం.

వాళ్ళ భవనం సింహద్వారంవద్ద వున్న నౌకరు కౌంటు చదువుకొనే గదిలోనికి నన్ను తీసుకెళ్ళి

కూర్చుండబెట్టి, నేను వచ్చిన విషయం చెప్పడానికి లోపలికి వెళ్ళాడు. గది విశాలంగా ఉంది. గోడలూ, అవీ అద్భుతంగా అలంకరించారు. గోడలు కానుకొని నాల్గువైపుల పుస్తకాల బీరువాలున్నాయి. ప్రతి బీరువాపైన ఒక కాంస్య విగ్రహం వుంది. తెల్లని చలువ రాతితో కట్టిన పొంతపై ఒక నిలువుటద్దం అమర్చారు. నేలపైన ఆకుపచ్చని జంబుఖానా పరిచారు. దానిపైన తివాచీలు చెల్లాచెదురుగా పడివున్నాయి.

కుగ్రామవాసంవల్ల, ఇలాంటి వైభవ విలాసాలు నేను స్వయంగా అనుభవించడం కాని, ఇతరులు అనుభవిస్తుండగా చూడడంకాని లేక చాలా రోజు లయింది. కాబట్టి గదిలో అడుగు పెట్టినప్పటినుంచి నా గుండె బితుకు బితుకుమంటూ ఉంది. ఏదో మనవి చేసుకోవడానికై మంత్రి దర్శనార్థం వచ్చిన పల్లెటూరివాడిలా బెదురుతో కాంటుకోసం కాసుక్కూర్చున్నాను. తలుపు తెరచుకొంది. కాంటు గదిలోకి వచ్చాడు. మనిషి చాలా అందగాడు. సుమారు ముప్పై రెండేండ్లుంటాయి. ఎంతో సౌహార్దంతో, స్నేహభావంతో దగ్గరకు వచ్చాడు. మనస్సు చిక్కబెట్టుకొనడానికి ప్రయత్నిస్తూ నన్ను నేను పరిచయం చేసుకోబొయ్యేలోగా ఆయనే పలుకరించాడు. ఇద్దరం కూర్చొన్నాం. చాలా రోజులుగా ఒంటరిగా జీవిస్తున్నందువల్ల నాలో

పైకొస్తున్న జంకు, సిగ్గూ, ఆయన కులాసాగా చెప్తూన్న కబుర్లు వినటంతో తొలగిపోయ్యాయి. నేను నా మామూలు ధోరణిలో సిద్ధాన్తో లేదో ఇంతలో కౌంటెస్ గదిలో ప్రవేశించింది. దానితో నేను ఉక్కిరి బిక్కిరి అయ్యాను. నిజంగా ఆమె అందాలరాణి-కౌంటు నన్ను ఆమెకు పరిచయం చేశాడు. నేను యథాలాపంగా మాట్లాడడానికి ప్రయత్నించాను. నేను నిర్లిప్తంగా కనిపించడానికి ప్రయత్నించేకొద్దీ మరింత ఎక్కువగా తడబడజొచ్చాను. నేను మనస్వాస్థ్యం పొంది, కొత్తవారితో మెలగడమలవాటు కావడానికి వ్యవధి అవసరమని గ్రహించి, చిరపరిచితుల సమక్షంలో ఉన్నట్టుగా వాళ్లు ఒకరితో ఒకరు మాట్లాడుకోజొచ్చారు. ఈలోగా నేను బీరువాలోని పుస్తకాలు, గోడలపైనున్న పటాలు, చూస్తూ గదిలో ఇటూ అటూ తిరుగుతూ ఉన్నాను. చిత్రపటాలను గురించి నాకు బొత్తిగా తెలీదు కాని, గోడపైనున్న ఒక చిత్రం మాత్రం నా దృష్టి నాకర్షించింది. అందులో స్విట్జర్లాండ్ లోని ప్రకృతి దృశ్యం మనోహరంగా చిత్రించారు. కాని నన్నాకర్షించింది నిజంగా అది కాదు. ఆ పటంలో సరిగ్గా ఒకదానిపై ఒకటి వున్న పిస్తోలు గుండ్ల రంధ్రాలు రెండున్నాయి.

"అతనెవరో మంచి గురికాడు." అని కౌంటు వైపు తిరిగి అన్నాను.

"ఔను అద్భుతమైన గురికాడు" అని కౌంటు సమాధానమిస్తూ "నీవూ మంచి గురికాడివేనా ?" అని అడిగాడు.

"అగ్రగణ్యుణ్ణనే చెప్పాలి." అన్నాను, తుదకు ప్రసంగం నాకభిమానమైన విషయంపై మరలిందని సంతోషిస్తూ. "ముప్పై అడుగుల దూరం నుండి గురి తప్పకుండా పేకముక్కను కొట్టగలను, నాకలవాటైన పిస్తోలుతో."

ఎంతో ఆసక్తిగున్నదానిలా కౌంటెస్ "నిజంగా!" అని అంటూ "ఏమండీ! మీరు ముప్పై అడుగుల దూరంనుండి పేకముక్కను కొట్టగలరా ?" అని భర్త నడిగింది.

"ఎన్నడైనా ఒక రోజు ప్రయత్నించి చూద్దాం. నాకాలంలో నేనూ మంచి గురికాణ్ణే, కాని పిస్తోలు ముట్టక నాలుగేండ్లయింది" అన్నాడు కౌంటు.

"ఓహో !" అని నేనందుకొన్నాను. "అలా అయితే ఇరవై అడుగుల నుండి కూడ మీరు పేక ముక్కను కొట్టలేరని నేను పందెంవేసి చెప్పతాను. పిస్తోలుతో కాల్చడమనేది ప్రతిరోజూ సాధనచేయ వలసిన విద్య – స్వానుభవంతో చెప్పతున్నా. ఇందులో

సిద్ధహస్తుణ్ణనే నా పటాలంలో నాకు పేరుండేది. కాని ఒకసారి నా పిస్తోలు రిపేర్‌కి పంపించాను. నెల రోజులు పిస్తోలు ముట్టలేదు. ఆ తరువాత ఏమయిందనుకొన్నారు? 25 అడుగుల దూరంనుండి, పేకముక్క మాట అలా విడిచి, ఒక సారాసీసాను కూడా కొట్టలేక పోయ్యాను. వరుసగా నాలుగుమార్లు గురి తప్పానంటే నమ్మండి. అప్పుడు మా కెప్టెన్ కూడ అక్కడేవున్నాడు. కొంచెం మాటకారిలెండి. "అబ్బాయి సారాసీసాను కొట్టటానికి నీ మనస్సు అంగీకరించడం లేదు లే" అని నవ్వుతూ అన్నాడు. పిస్తోలు విషయంలో నిత్యసాధన మాత్రం తప్పించకూడదు. తప్పిస్తే, మళ్ళీ మొదటికి వస్తాం. పిస్తోలు విద్యలో మించి ఘటికుడైనవాణ్ణి నే నెరుగుదును. అంతటివాణ్ణి మళ్ళీ చూడలేదు. రోజూ భోజనానికి ముందు మూడు సార్లైనా కాల్చేవాడు. అది ఆయన కొక అలవాటయిపోయింది ఒక గ్లాసు ఓడ్కా పుచ్చుకోవడంలాగా.

నోటికి పడిన గడియ జారి యథాలాపంగా మాట్లాడుతున్నందుకు భార్యాభర్తలు సంతోషించారు.

"నీ స్నేహితుని నైపుణ్యాన్ని గురించి విశేషాలేమైనా చెప్పు విందాం" అని అడిగాడు కౌంటు.

"చెప్తావినండి. ఇంట్లో గోడపైన ఈగ వాలటం ఆయన కంటపడిందంటేసరి... అదిగో! అదిగో! మీరు

కూడా నవ్వుతున్నారు కౌంటెస్! నేను ప్రమాణంచేసి చెప్పుతున్నా. నేనంటున్న. ప్రతి అక్షరంనిజం - గోడపై ఈగను చూచిన తక్షణం 'కుజ్కా! నా పిస్తోలీరా తీసుకురా' అని కేకవేసేవాడు. అతని నౌకరు కుజ్కా బారుచేసిన పిస్తోలు తెచ్చి చేతి కందించేవాడు. పిస్తోలు ఢాం! అనేసరికి ఈగచచ్చి నలిఅయి అట్లే గోడకంటు కొని వుండేది."

"అసాధ్యుడే! ఆయనపేరు?" అని అడిగాడు కౌంటు.

"సిల్వియో."

"సిల్వియో!" అని కౌంటు ఎగిరి గంతేశాడు. "అయితే సిల్వియో నీకు తెలుసన్నమాట?"

"తెలియటమేమిటి! మా కిద్దరికి చాలా స్నేహం. అతణ్ణి మా పటాలంలోవారంతా తమ తోడి ఆఫీసరులాగానే చూచేవారు. కాని అయిదేళ్ళనుండి ఆయన పత్తా లేదు. ఐతే ఆయన్ను మీరుకూడ ఎరుగుదురన్నమాట."

"బాగా ఎరుగుదును. అతను నీతో ఎప్పుడూ చెప్పలేదా? ......చెప్పకుండా ఉండడు...... అది అసాధ్యం......తన జీవితంలో జరిగిన ఒక విచిత్ర సంఘటన నీతో చెప్పలేదా?"

"ఒక షోకేలా అతని చెంపకు తీసికొట్టిన సంగతా మీ రంటున్నది?"

"ఆషోకేల్లా పేరు చెప్పలేదు అతను?"

"చెప్పలేదు." – తటాలున నాకు అసలుసంగతి తట్టింది.

"క్షమించండి! నాకు తోచలేదు. . .మీ రేనా?" అని అడిగాను.

"ఔను నేనే" అని కౌంటన్నాడు. మనస్సులో చాలా బాధపడుతున్నట్టు కనబడ్డాడు. "పిస్తోలు గుళ్ళ రంధ్రాలున్న ఆ పటం మేము కడపటిసారి కలుసుకొన్నప్పటి గుర్తు."

కౌంటెస్ భర్తవైపు దీనంగాచూస్తూ ఇలా అంది: "మీ పుణ్యముంటుంది :! ఇంకావిషయం కట్టిపెట్టండి. ఆసంగతెత్తితే నాకు భయమవుతోంది."

"కాని తప్పదు. ఆ పటం చెప్పాలి. . . . . .జరిగినదంతా చెప్పాలి. తన స్నేహితుణ్ణి నేనెలా అవమానించానో వీరికి తెలుసు. అతనూ నాపైన ఎలా పగ సాధించాడో కూడా తెలుసుకోనీ!" అంటూ నాకోసం ఒక పడకకుర్చీ దగ్గరకు యీడ్చాడు. మహోత్కంఠతో వింటున్న నాకు జరిగిన కథ పూసగుచ్చినట్టు ఇలా చెప్ప నారంభించాడు:

"ఐదేళ్ల కిందట నాకు వివాహమయింది. నా పెళ్లయిన తరువాత మొదటి నెలంతా నా భార్యతో ఈ గ్రామంలోనే గడిపాను. నా జీవితంలో మధురాతి మధురమైన క్షణాలు ఈ ఇంట్లో గడిపాను. అత్యంత విషాదకరమైన స్మృతులుకూడ ఈ ఇంటివే.

ఒకరోజు సాయంత్రం మేమిద్దరం గుర్రాలెక్కి వాహ్యాళికి బయలుదేరాము. నా భార్య గుర్రం దోవలో హఠాం చేయడం ప్రారంభించింది. ఆమెకు భయమై కళ్ళెం నాచేతికిచ్చి ఇంటికి నడిచి వెళ్ళింది. నేను గుర్రంపైనే వెళ్ళాను. ఇల్లు చేరేసరికి ముంగిట ఒక బగ్గీ నిలిచి వుంది. నా గదిలో ఎవరో నాకోసం వచ్చి కాచుకొని వున్నారని నౌకర్లు చెప్పారు. అతను నాతో పనివున్నట్లు మాత్రమే చెప్పాడని, పేరు చెప్పడానికి నిరాకరించాడని నౌకర్లన్నారు. నేను గదిలోనికి వెళ్ళాను. చీకటిపడే సమయం; సరిగ్గా యిక్కడ్నే ఈ పొంతవద్ద ఒక మనిషి నిల్చొని వున్నాడు. గడ్డం మాసింది. బట్టలపైన దుమ్ము పేరుకొని వుంది. ఎవరా అని జ్ఞప్తికి తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ అతణ్ణి సమీపించాను. "నన్ను గుర్తించలేదు?" అని కంపిత స్వరంతో అన్నాడతను. "సిల్వియో" అని నేను కేక వేశాను. నా దేహం కాలిగోరినుంచి కనురెప్పవరకూ గగుర్పొడిచింది.

"అవును సిల్వియోను, యిక నావంతుంది. పిస్తోలు గుండువదలడానికి వచ్చాను. సిద్ధంగా వున్నావా?" అన్నాడు.

అతని ఎదపైన కోటుజేబీలో వున్న పిస్తోలుకొన బైటకి కనబడుతూ వుంది. ఎంచుకుంటూ పండెండడుగులువేసి ఆ మూల నిలబడి నా భార్య రాకముందే త్వరగా కానిమ్మని అన్నాను. చీకటిగా వుంది. దీపం కావాలని కొంత ఆలస్యం చేసాడు. సరేనని కొవ్వొత్తులు తెప్పించి పెట్టాను. ఎవరూ లోపలికి రాకూడదని నౌకర్లకు ఉత్తరవుచేసి తలుపుబిగించి తాళంవేశాను. సిల్వియోతో యిక కానిమ్మని అన్నాను. అతను పిస్తోలు బయటకుతీసి ఎక్కుపెట్టాడు. నేను క్షణాలు లెక్కపెడుతున్నాను...గుండెలో నాభార్య మెదులుతూంది. ఒక నిమిషం గడిచింది. యుగంలాంటి దీర్ఘమైన నిమిషం. సిల్వియో చేయి కిందికి దిగిపోయింది. 'నా పిస్తోలులో బారుచేసినవి చెర్రీపళ్లవిత్తులు కానందుకు నాకు చింతగావుంది. ఈ గుండ్లెంత బరువని! ఇది ద్వంద్వయుద్ధంకాదు, ఖూనీ అని నా అంతరాత్మ బాధిస్తూంది. నిరాయుధునిపై పిస్తోలెక్కుపెట్టడం నా కలవాటులేదు. మళ్ళీ అంతా మొదటినుంచీ ప్రారంభిద్దాం. మొదట ఎవరు కాల్చవలసింది చీటీ వేద్దాం. నా తల తిరిగిపోయింది. నేనందు కంగీకరించలేదని నాకు జ్ఞప్తి...కనుక మే మింకొక

పిస్తోలుకూడ బాయచేశాం. రెండు చీటిల్లో మాపేర్లు రాసి మడ్చి, ఒకప్పుడు నా పిస్తోలు గుండు దూసుకొని పోయిన ఆ టోపీలో వేశాం. మళ్ళీ అదృష్టదేవత నన్నే వరించింది. "అదృష్టమంటే నీదే కౌంటు!" అని సిల్వియో అన్నాడు. అప్పుడతని పెదవిపై తోచిన చిరునవ్వు నే నెన్నటికీ మరచిపోను. నన్నే పిశాచి ఆవేశించిందో, నేనది ఎలా చేయగలిగానో యిప్పటికీ నాకర్థం కావడంలేదు. కానీ...నేను పిస్తోలు కాల్చాను! గుండు ఆపటానికి వెళ్ళి తగిలింది."

కౌంటు పిస్తోలుగుండ్ల రంధ్రాలున్న ఆ పటంపైకి వేలెత్తి చూపాడు. అతని చెక్కిళ్ళు జేవురించాయి. కౌంటెస్ మొగంలో నెత్తురుబొట్టు లేదు. ఆమెపైనున్న శాలువకన్నా ఆమె మొగం తెల్లబడిపోయింది. నేను అప్రయత్నంగా 'ఆఁ!' అని అన్నాను. కౌంటిలా కొనసాగించాడు.

నేను పిస్తోలు కాల్చాను, దేవుని దయవల్ల గురి తప్పింది. తరువాత సిల్వియో – ఆ క్షణంలో అతడెంత భయంకరంగా కనపడ్డాడని – పిస్తోలెక్కుపెట్టి గురిచూచుకొంటున్నాడు, దబాలున తలుపు తెరుచుకొంది. మాషా లోనికి పరుగెత్తుకొనివచ్చి నా భుజంపై వాలి బోరున ఏడువసాగింది. మాషాను చూడగానే నా మనస్సు కొంచెం స్వాధీనానికి వచ్చింది. ఆమెతో అన్నాను:

'మాషా! యిదంతా వేళాకోళమని కనపడడం లేదూ? నీవిప్పుడెలా వున్నావనుకున్నావు. మళ్ళీ కాస్త మంచి నీళ్ళు తాగిరా. సైన్యంలో నాతోపాటున్న నా పాత స్నేహితుణ్ణి నీకు పరిచయం చేస్తాను.' మాషా నామాట నమ్మలేదు. మహా భీషణంగా కనపడుతున్న సిల్వియో వైపు తిరిగి 'మావారంటున్నది నిజమేనా చెప్పండి' అని అడిగింది. 'ఇదంతా వేళాకోళమేనా?'

సిల్వియో అన్నాడు: 'మీ ఆయన ఎప్పుడూ వేళాకోళమాడుతూనే వున్నాడు. వేళాకోళానికి ఒకసారి నా చెంపకు తీసికొట్టాడు. వేళాకోళానికే పిస్తోలుతో నా తలపై టోపీలోనికే గుండు దూసుకొనిపోయేలా కాల్చాడు. ఇప్పుడుకూడా వేళాకోళానికే గురితప్పాడు. ఇప్పుడు నేను వేళాకోళం ఆడాలనిపిస్తోంది!' ఈ మాటలంటూ మళ్ళీ పిస్తోలెక్కుపెట్టేవాడిలా చేయెత్తాడు, మాషా సమక్షంలోనే! మాషా అతని పాదాలపై బడింది. "సిగ్గులేదూ మాషా, పైకి లే!" అని నేను మహా వుద్రేకంతో అరచాను. "దయవుంచి అదృష్టహీనమైన ఆడదాన్ని ఎగతాళి చేయడం ఆపుతారా! మీరు కాల్చదలచుకున్నారా లేదా చెప్పండి!"

సిల్వియో యిలా అన్నాడు: "కాల్చదల్చుకోలేదు. నా పంతం నెగ్గింది. నీలో ఆందోళనా, భయం కలగడం కన్నారా చూచాను. పిస్తోలు తీసుకొని మళ్ళీ

నీవు నన్ను కాల్చేటట్టు చేశాను. నాకది చాలు. నేను నీకెప్పుడూ జ్ఞాపకముంటాను. నీ అంతరాత్మకు నిన్ను వదలిపెట్టి పోతున్నాను" ఈ మాటలని వెళ్ళిపోతున్న వాడిలా ముందుకు సాగాడు. కానీ ఆ వాకిట్లో ఆగి నా పిస్తోలు గుండు తగిలిన చిత్రంవైపు చూచి, గురి చూచుకోకుండానే పిస్తోలు పేల్చి అదృశ్యమయ్యాడు. మాషా స్పృహతప్పి పడిపోయింది. మా నౌకర్లు అతన్ని ఆపే ధైర్యంలేక నిర్విణ్ణులై చూస్తున్నారు. సిల్వియో తలవాకిట నిల్చొని కేకవేసి బండివాణ్ణి పిల్చి నేను తెలివి తెచ్చుకునేలోపల్నే వెళ్ళిపోయాడు."

కౌంటు తర్వాత మాట్లాడలేదు.

నా గుండెలో హత్తుకొని పోయిన సంఘటనలతో ఆరంభమయిన కథ యిలా ముగిసింది. ఈ కథా నాయకుణ్ణి మళ్ళీ నేను చూడలేదు. సిల్వియో, అలెగ్జాండరు యిప్సిలాంటి తిరుగుబాటులో ఒక దళాధిపతిగా వుండి పోరాడుతూ, స్కూల్యానీ యుద్ధంలో హతుడయ్యాడని అంటారు.



రాలు రిప్పల నేల గుర్రాలు పరుగెత్త,
కాలిగిట్టల క్రిందబడి మంచుపొర విరుగ;
ఒక్క నరమానవుడు లేనట్టి అచ్చోటు
ఎక్కడిదో ప్రత్యక్షమయ్యె నొక దేవళము!

.... .... ....

పన్నిట్టులుండి వేచె మహోద్ధృతి తుపాను,
మిన్ను మన్నేకమై మంచుపింజెలగములు
ముడిగట్టి దిగజారె; మాలకాడె యొకండు
పడిలేచి స్లెడ్జిపై వడి యీసుకొనిపోయె!

ఈ శకునపక్షి అరపకట! పక్షిమీయ
శరవేగమున పారు తురగాలు పలుమారు
తెరువుగానగలేక ఒడలంత కనులుగా,
మోరలెత్తి, భయార్తి మెడజూలు పై కెగయ
ఘోర గాఢాంధకారములోని కదె మాము!

— ఝుకోవ్‌స్కీ[7]

మన దేశ చరిత్రలో చిరస్మరణీయమైన 1811 వ సంవత్సరం చరమపాదం నడుస్తూన్న రోజుల్లో గవ్రిలా గవ్రిలో విచ్ రా. . . నెనరాడొవో అనే తన ఎస్టేటులో నివసిస్తూ వున్నాడు. గవ్రిలా గవ్రిలావిచ్ సజ్జనుడు. మెత్తని మనస్సు, వితరణ కలవాడని చుట్టుపట్లంతా పేరున్నవాడు. ఇరుగు పొరుగువారెవరో ఒకరు అతని గడప తొక్కని రోజు లేదు. అతని ఇంట్లో కడుపునిండా తిని, తాగి, అయిదుకోపెక్కుల మేజుపెట్టి అతని భార్యలతో పేకాడటానికి కొందరూ, వాళ్ళ కుమార్తెను చూచిపోవడానికి కొందరూ వస్తూవుంటారు. మార్యా గవ్రిలోవ్నా 17 ఏళ్ళ పిల్ల. బక్కపలుచగా, కొద్దిగా పాలి నట్టు వుంటుంది. వాళ్ళది మంచి సంబంధం కాబట్టి, ఆ అమ్మాయిని తమ కుమారులకు చేసుకోందామనే తల్లిదండ్రులూ, పెళ్ళాడాలనే యువకులూ చుట్టుపట్ల చాలా మంది ఉండేవారు.

మార్యా గవ్రిలోవ్నా చిన్నతనంనుంచీ ఫ్రెంచి నవలలు చదువుకొన్న పిల్ల కాబట్టి ప్రణయ రసాబ్ధిలో మునిగివుంది. ఆమె ప్రేమిస్తున్న యువకుడు సైన్యంలో ఒక చిన్న ఆఫీసరు. సెలవుపైన స్వగ్రామానికివచ్చి వుంటున్నాడు. మనిషి బక్కపలుచగా వుంటాడు. అతనుకూడ మార్యాకు పంచప్రాణాలు అప్పగించేశాడినీ, ఉభయుల ధోరణి గమనించిన పిల్లతల్లిదండ్రులు

అత్తణ్ణి మరచిపోమ్మని ఇటు కూతురికి హెచ్చరికచేసి, అటు ఆ యువకుడింటి గడప తొక్కితే పింఛనీ పుచ్చుకొనే మేజిస్ట్రేటును చూచినట్లుగా మాతిబిగించుకొనే వారనీ వేరే చెప్పనవసరం లేదు.

మన ప్రేమికుల మధ్య జాబులు నడిచేవి. రోజూ ఒక దేవదారు వృక్షం క్రిందో, లేక ఒక పురాతనమైన చర్చివద్దో రహస్యంగా కలుసుకొని తమ ప్రేమ అచంచలమైనదని ఒకరికొకరు ప్రమాణాలు చేసుకోవటం, తమ స్థితిని తలచుకొని దుఃఖించటం, ఇంకా చేయవలసిన కార్యమేమని లక్షాపది ఉపాయాలు వెదకటం మామూలయింది. ఇలాంటి సమావేశాలూ, ఇద్దరిమధ్య నడచిన ఉత్తర ప్రత్యుత్తరాల ఫలితంగా వారీక్రింది నిర్ణయానికి (ఇది సహజం) వచ్చారు. మనమేమో ఒకరు లేకపోతే ఒకరు బ్రతకలేం కాని హృదయంలేని మన తల్లిదండ్రులేమో మన సుఖానికి ఆటంకమై కూర్చున్నారు. ఈ పరిస్థితుల్లో వాళ్ల అంగీకారమే అవసరం లేదని మన మెందుకు నిశ్చయించుకోకూడదు ? ఈచక్కటి ఆలోచన మొదట యువకునికి తోచగా, స్వప్న జగత్తులో విహరించే మార్యాకు ఇది బలే ఆలోచన అని సంతోషించిందని సులభంగా ఊహించవచ్చు.

శీతాకాలం వచ్చి వారి సమావేశాలకు స్వస్తి చెప్పింది. కాని ఈ కారణంవల్ల వాళ్ళ మధ్య నడుస్తున్న

ఉత్తర ప్రత్యుత్తరాలు మరింతజోరైనాయి. వ్లాడిమిర్ నికొలయెవిచ్ ప్రతిజాబులోనూ ఇలా బ్రతిమాలేవాడు: "నీవు నాదానివికా; మనం రహస్యంగా పెళ్ళి చేసుకొని కొన్నాళ్ళెక్కడైనా తలదాచుకొని వుందాం. ఆ తరు వాత ఇద్దరం పెళ్ళి మీ తల్లిదండ్రుల పాదాలపై బడితే, ఎంత సాహసానికైనా వెనుదీయని మన ప్రేమా, మనం పడిన కష్టాలూ చూచి మనసుకరగి అయ్యో! నా చిన్నారి పాపల్లారా! అని మనల్ని అమాంతంగా కౌగిట్లోకి తీసు కొంటారు."

ఐనా, మార్యా గవ్రిలోవ్నా చాలా రోజులవరకు ఒక నిశ్చయానికి రాలేకపోయింది. ఇద్దరూ లేచిపోవడాని కి తనువేసిన ఎన్నోప్లానులకు ఆ అమ్మాయి ఒప్పుకోలేదు. తుట్టతుదకు సరే అంది. వాళ్ళు లేచి పోయేరోజు, తల నొప్పిగా వుందనే సాకుపెట్టి మార్యా అందరితో పాటు భోజనానికి వెళ్ళకుండా తన గదిలోనేవుండి పోవాలి. మార్యా, మార్యా పనిమనిషీ, (ఆ పిల్లకుకూడా ఈ రహస్యం చెప్పారు) ఇద్దరూ పెరటితోటలోనికి వెళ్ళితే అక్కడ ఒక స్లెడ్జి కాచుకొని వుంటుంది. అది ఎక్కి నెనరదొవోకు మూడుమైళ్ళదూరంలో వుండే జాద్రినో గ్రామం చర్చికి నేరుగా వెళ్ళాలి. అక్కడ వ్లాడిమిర్ వాళ్ళకోసం కాచుకొని వుంటాడు, ఇదీ ప్లాను.

ఇక రేపు పారిపోవాలి. ఆ రాత్రంతా మార్యా నిద్రపోలేదు. తనబట్టల పెట్టెలన్నీ తెరచి తనకు కావలసిన కొన్ని బట్టలను మూటగట్టుకొంది. తన స్నేహితురాలికి, అమ్మకూ, నాన్నకు సుదీర్ఘమైన ఉత్తరాలు రాసింది. తలిదండ్రులకు రాసిన జాబులో బలవత్తరమైన ప్రేమే తన్నింత సాహసానికి పురికొల్పిందని వ్రాస్తూ గుండె కరగించే మాటలతో వెళ్ళి వస్తానని చెప్పింది. వాళ్ల పాదాలపై పడడానికి తమకు అనుమతి లభించిన క్షణం కన్న తన జీవితంలో సంతోష సమయం మరొకటి లేదనే ప్రకటనతో ఉత్తరం ముగించింది. ఈరెండు లేఖల్నీ ప్రణయపారబద్ధమైన హృదయద్వయ చిత్రమూ, దానికి క్రింద తదనుగుణమైన మాటలుగల ఒక ముద్రతో సీలు వేసింది. తెల్లవారుఝాము కిదంతా ముగించుకొని మార్యా పరుపుపై కనువాల్చేసరికి కొద్దిగా కునుకుపట్టింది. కాని కొన్ని నిమిషాలకే భయంకరమయిన స్వప్నం వచ్చి మెలకువవచ్చింది. స్వప్నంలో, చర్చికి వెళ్ళడానికై తాను స్లెడ్జెక్కి కూర్చుంటోంది. సరిగ్గా ఆ క్షణానికి ఆమె తండ్రి వచ్చి ఆపి, మంచుపైన తన్ను జరజర ఈడ్చుకొంటూ పోయి ఒక అంధకార గహ్వరం లోనికి విసరివేశాడు. దానికి అడుగున్నట్టులేదు. తాను శరవేగంతో కిందికి పడిపోతూ వుంటే గుండె ఆగిపోయి నంతపని అయింది. ఇంకొక కలలో వ్లాదిమిర్ పచ్చికపై

క్షతగాత్రుడై పడివున్నట్టు చూచింది. అతను ప్రాణాలు విడుస్తూ, చెవులు తూట్లుపడే కంఠస్వరంతో పెళ్ళి త్వరగా కానిమ్మని తన్ను బతిమాలుతున్నాడు. ఇలా భయానకమైన దృశ్యాలు కలగా పులగంగా ఆమె మనో నేత్రంముందు తారసిల్లిపోతున్నాయి. తుదకు మార్యా లేచి నిల్చుకొంది. ముఖం మామూలుకన్నా పాలి పోయింది. నిజంగా తలనొప్పి ప్రారంభమయింది. ఆమె నాన్నా, అమ్మా, మార్యా కలవరపాటు గమనించారు. ఎంతో ప్రేమతో "ఏమలా వున్నావు మాషా?" అని వారు గుచ్చిగుచ్చి అడిగే ప్రశ్నలు మార్యా హృదయానికి ములుకుల్లా తాకుతున్నాయి. సంతోషంగా కనిపించడానికెంత ప్రయత్నించినా సాధ్యం కావడంలేదు. సాయంత్ర మయింది. తను పుట్టి పెరిగిన ఇంట్లో, తన అయినవారి మధ్య గడిపే ఆఖరి రోజిదే అనే తలపు గుండెను కదుపుతూ వుంటే ఊపిరాడడమే కష్టంగా వుంది. చిరకాల పరిచిత ప్రియమైన ఇంట్లోని వస్తువులతోను, తన వాళ్ళతోనూ వెళ్ళివస్తానని మనసులోనే శెలవు తీసుకొంది.

ఇంతలో భోజనానికి పిలుపువచ్చింది. గుండెదడ హెచ్చింది. గద్గదస్వరంతో తనకు భోజనమక్కర లేదనీ, వెళ్ళి పడుకొంటాననీ అమ్మా, నాన్నతో చెప్పింది. వాళ్ళు మామూలుగానే ముద్దుపెట్టుకొని "వెళ్ళు తల్లీ"

అని అన్నారు. మార్యాకు ఏడ్పువచ్చింది. తన గదిలోకి వెళ్ళిందో లేదో దభాలున పడకకుర్చీలోపడి బోరుమని ఏడ్వనారంభించింది. మనస్సు కుదుట పరుచుకొమ్మని బతిమాలింది దగ్గరనేవున్న పరిచారిక. అంతా సిద్ధంగా ఉంది. ఇక అర్థగంటకు మాషా తాను పుట్టిన ఇంటికీ, తనగదికీ, తన కన్యత్వానికీ వీడ్కోలు చెప్పాలి...... బయట మంచుతుపాను హోరుమంటోంది. రయిమని వీస్తున్న గాలికి కిటికీతలుపులు పటపటమని కొట్టుకొంటున్నాయి. ప్రకృతి అంతా ఒక దుశ్శకునంలా, తన కేదో హెచ్చరిక ఇస్తున్నట్లు అగుపిస్తోంది.

కొన్ని నిమిషాలకు ఇల్లంతా నిద్రాదేవి ఒడిలో కన్నుమూసింది. మాషా తన భుజాలను శాలువతో కప్పుకొని ఒక వెచ్చని వులన్ దుప్పటి పైన వేసుకొని నగలపెట్టె చేత్తో పట్టుకొని పనిమనిషితో కలిసి ఇంటి నుండి బయలుదేరింది దొడ్డిదారిన. పనిమనిషి చేతిలో రెండు మూటలున్నాయి. ఇద్దరూ తోటలోకి వెళ్ళారు. తుఫాను ఉధృతి తగ్గలేదు. గాలి మొగానికి కొడుతూ వుంది, పాపంమార్గోన్ముఖులయిన ఆ యువతులను వెనక్కు మళ్ళించడానికి ప్రయత్నిస్తున్న దానివలె. తోట చివరకు వెళ్ళేసరికే వాళ్ళకు చాలఆలశ్యమయిపోయింది రోడ్డులో వారికోసం స్లెడ్జికాచుకొనివుంది. ఎముకలు కొరికే చలిలో గుర్రాలు కదలకుండా నిల్చుకోలేకున్నాయి. వాటిని

అదుపులో వుంచడానికి ప్రయత్నిస్తూ, వ్లాడిమిర్ బండి మనిషి గుర్రాల ముందు అటూఇటూ తిరుగుతూ ఉన్నాడు. మార్యాసూ, పనిమనిషినీ స్లెడ్జి ఎక్కించి వారు తెచ్చిన మూటలూ, నగలుపెట్టె సర్ది బండివాడు కళ్ళాలందుకొన్నాడో లేదో గుర్రాలు ఒక్కగంటలో దౌడుతీశాయి.

మన కథానాయికను ఆమె గతికి, బండిమనిషి టెరిష్కా నైపుణ్యానికి వదలిపెట్టి ఆమె ప్రియుడేమి చేస్తున్నాడో చూద్దాం. వ్లాడిమిర్‌కు ఆరోజంతా విరామంలేదు. అక్కడికి ఇక్కడికి ఒకే తిరగడం. ఉదయం జాద్రినోలో మతగురువును కలుసుకొని పెళ్ళి చేయిస్తానని అతనితో ఎల్లాగో ఒప్పించుకొన్నాడు. అక్కడనుంచి బయలుదేరి ఇరుగుపొరుగు భూస్వాముల్లో పెళ్ళికి సాక్షులుగా వచ్చేవారెవరైనా ఉన్నారా అని వెదకడం ప్రారంభించాడు. మొట్టమొదట డ్రావిన్ అనే అతణ్ణి చూచాడు. డ్రావిన్ అశ్వికదళంలో పనిచేసి రిటయరయిన నలభై ఏళ్ళ మనిషి. వ్లాడిమిర్ అడిగిందే తడవుగా సాక్షిగా రావడానికి అంగీకరించాడు, తాను హుస్సారుల్లో పనిచేస్తున్నప్పటి పాతరోజులూ, అల్లరీ జ్ఞప్తికి వస్తున్నదని అంటూ. ఇంతేకాదు. మిగతా ఇద్దరు సాక్షులనుకూడ సంపాయించి పెడతానని హామీయిచ్చి వ్లాడిమిర్‌ను భోజనానికి పిల్చాడు. భోజనాలయినా వో

లేదో కోరమీసం తిప్పుకొంటూ, గుర్రపుకాతు బూట్లు వేసుకొన్న లాండు సర్వేయరు స్కిమిడ్ అక్కడికి వచ్చాడు. అతనివెంట కొత్తగా ఉహ్లాన్ దళంలో చేరిన పదహారేళ్ళ కుర్రవాడొకడున్నాడు. జిల్లా పోలీస్ ఆఫీసరు కొడుకు. వ్లాడిమిర్ కోర్కె అంగీకరించడమేకాక, అతనికోసం, తమ ప్రాణాలు త్యాగం చేయడానికి సిద్ధంగా వున్నామని ప్రమాణం చేశారు. వ్లాడిమిర్ మహదానందంతో వాళ్ళను కౌగలించుకొని తక్కిన ఏర్పాట్లు చేయడానికి ఇంటికెళ్ళిపోయాడు.

చీకటిపడింది. వ్లాడిమిర్ నమ్మకస్తుడయిన తెరెష్కాకు చెప్పవలసిన వివరాలన్నీ చెప్పి స్లెడ్జితో నెనరి డ్నోకుఅటు పంపించివేసి, తాను చిన్నటి గుర్రం స్లెడ్జిని సగీయించి జాడ్రినో గ్రామానికి బయలుదేరాడు. మార్యాగవ్రిలోవ్నా రెండు గంటల్లో ఆ పల్లెకు వస్తుంది. జాడ్రినోవ్ చేరడానికి తనకు ఇరవై నిమిషాల కంటే ఎక్కువ పట్టదు. తనకు దోవ బాగా తెలుసు.

ఐతే వ్లాడిమిర్ తన గ్రామం దాటి వచ్చాడో లేదో విపరీతమైన గాలిలేచి, మంచుతుపాను ప్రారంభమయింది. వ్లాడిమిర్‌కు కన్ను పొడుచుకొన్నా ఏమీ కనపడడంలేదు. ఒక్క నిమిషంలో రోడ్డంతా మంచు కప్పుకొంది. హిమపాతంతో మిన్నూమన్నూ ఏకమై,

సరిసరాలన్నీ అదృశ్యమయ్యాయి. అంతరిక్షంలో మంచు పింజలు శరవేగంతో సుళ్ళు తిరుగుతూ వున్నాయి. వ్లాడిమిర్ తానొక పొలంమధ్యలో వున్నానని, తెలుసుకొని మళ్ళీ రోడ్డు చేరుకోవాలని వృథాప్రయత్నం చేశాడు. గుర్రం ఎక్కడేముందో కనపడక, గుడ్డిగా ముందుకు అడుగేస్తూ పడి లేస్తూవుంది. కోనాముదాటి స్లెడ్జిబోల్తాపడుతూనేవుంది. ఏమయినా సరే దోవ తప్పకూడదని వ్లాడిమిర్ విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

కాని బయలుదేరి అర్ధగంటయి నట్లున్నప్పటికీ జాడ్రినో ఊరిముందుండే వనమింకా రాలేదు. మరొక పదినిమిషాలు గడిచింది. వనమెక్కడా కనిపించడం లేదు. వ్లాడిమిర్ స్లెడ్జి అగడ్తల్లాంటి పల్లాలుండే బట్ట బయల్లో పోతోవుంది. తుపాను తగ్గలేదు. ఆకాశంలో కారుమబ్బులు కమ్ముకొనేవున్నాయి. గుర్రం అలసి పోయినట్లు కనబడుతోంది. పదేపదే మంచులో నడుము లోతు వరకు దిగబడి పోతూవున్నప్పటికీ వ్లాడిమిర్ ఒళ్ళంతా చెమటలు కారుతున్నాయి.

కడకు, తను పోవలసినదిశ తప్పించి ఇంకో దిక్కుగా పోతున్నానని కనుక్కొన్నాడు. కళ్ళెం బిగబట్టి, ఆలోచించ సాగాడు. ఎక్కడ దోవతప్పింది, ఏదిశగా ఎంతదూరం వచ్చింది జ్ఞప్తికి తెచ్చుకొని తను ప్రస్తుత

ఎక్కడవున్నాడో నిర్ధారణచేయడానికి ప్రయత్నించాడు. తాను కుడిచేతివైపు తిరగవలసి వుండిందని తేల్చి, స్లెడ్జిని ఆవైపుకు మళ్ళించాడు. కాని గుర్రం కదలడమే గగనమయింది. తాను వూరువిడిచి గంట అయివుంటుంది. కాబట్టి ఝాద్రినో అట్టే దూరముండ దనుకొన్నాడు. స్లెడ్జిని ఎంతదూరం నడిపించినా పొలానికి అంతూపొంతూ వున్నట్టు కనపడలేదు – మంచుదిబ్బలూ, పర్రలూ, స్లెడ్జి అడుగడుక్కూ తల్లక్రిందులవుతూ వుంది. అడుగడుక్కూ దాన్ని ఎత్తవలసివస్తోంది. కాలంగడిచి పోతూ వుంది. వ్లాడిమిర్ విపరీతంగా ఆందోళన చెందనారంభించాడు.

ఓ అంతసేపటికి ఒకపక్క నల్లగా కానవచ్చింది. వ్లాడిమిర్ గుర్రాన్ని ఆవైపు తిప్పాడు. దగ్గరకుపోయి చూస్తే అదొక వనమని తేలింది. అబ్బ! ఆఖరుకు వచ్చేశాననుకొన్నాడు. స్లెడ్జిని వనంగుండా పోనిచ్చాడు. రోడ్డు చేరుకుంటాననే ఆశతో. రోడ్డుకు కలుసుకోక పోయినా, వనమవతలనే జాద్రినో. కొన్ని నిమిషాలకు వ్లాడిమిర్ రోడ్డు కనుకొన్నాడు. ఇరువైపులా వున్న చెట్లక్రింద స్లెడ్జిని పోనిచ్చాడు. ఆకులన్నీ రాలిపోయిన చెట్లకొమ్మలుమాత్రమే మిగిలాయి. ఇక్కడ గాలి తాకిడికూడ లేదు. రోడ్డుకూడ ఎగుడుదిగుళ్లు లేక

చదునుగావుంది. గుర్రానికి గుండెదివుటు కలిగింది. వ్లాడిమిర్ ఇక ఫరవా లేదనుకొన్నాడు. ....

కాని స్లెడ్జిని ఎంతసేపు తోలుకొంటూ పోయినా, జ్రాడ్రినో పొడ లేదు. వనానికి అంతమున్నట్టూ లేదు. తానిదివరకు చూడని అడవిలో వున్నట్టు వ్లాడిమిర్‌కు అర్థమయింది. గుండెలో రాయిపడింది. నిరాశతో వచ్చే ఉక్రోషంతో గుర్రాన్ని బాధాడు. పాపమది దవుడు తీసింది కాని కొద్దిసేపటికే సడుగులుడిగి, వ్లాడిమిర్ ఎంత గింజుకొన్నా అడుగులో అడుగు వేసుకొంటూ నడవసాగింది.

పోనుపోను అడవి పల్చబడింది. కడకు వ్లాడిమిర్ అడవిదాటి బయటపడ్డాడు. జోడ్రినో జాడలేదు. అప్పటికి అర్ధరాత్రి అయివుంటుందని తోచింది. వ్లాడిమిర్ కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. గుర్రం ఎలాపోతే అలా పోనిస్తున్నాడు స్లెడ్జిని. కొంతసేపటికి తుఫాను తగ్గింది. మేఘాలు విచ్చాయి. చుట్టూ చూపుమేరవరకు మంచుతో కప్పబడి ఉంది. అల్లంతదూరంలో ఒక చిన్న పల్లె కనబడుతూ వుంది. వ్లాడిమిర్ స్లెడ్జిని పల్లెవైపు తోలి వచ్చాడు. దారిలో తగిలిన మొదటి గుడిసెముందు ఆగి, స్లెడ్జినుండి బయటికి దుమికి కిటికీవద్దకు పరుగెత్తి దబదబ తట్టాడు. కొన్ని నిమిషాలకు కిటికీతలుపు పెకి

తెరచుకొంది. ఒక ముసలివాడు గడ్డం బయటికిపెట్టి అన్నాడు :

"ఏం కావాలి ?"

"ఇక్కడినుండి జాడ్రినోచాలా దూరమా ?"

"జాడ్రినో దూరమా అని అంటున్నావా ?"

"ఔనౌను. దూరమేనా ?"

"చాలా దూరం లేదు. ఏడు మైళ్ళుంటుంది." వ్లాడిమిర్ ఆ మాట వింటూనే సంట్రుకలు గుంజుకొని రాయిలా నిలబడ్డాడు – ఉరిశిక్ష విధింపబడిన నేరస్థుడిలా.

"నీ వెక్కడి నుండి వస్తున్నావు ?" ముసలి తాత అడిగాడు. అతని ప్రశ్నకు జవాబుచెప్పే నిబ్బరం లేదు వ్లాడిమిర్‌కు.

"ముసలయ్యా ! జాడ్రినోకు వెళ్ళటానికి నాకొక గుర్రం సంపాదించి పెడతావా ?" అని అడిగాడు.

"మాకు గుర్రాలున్నట్లు !" అన్నాడా రైతు.

"అయితే నాకు దోవచూపించేందు కొక మనిషినైనా చూపెడతావా, పోనీ అతనెంత అడిగితే, అంతిస్తాను".

ముసలివాడు కిటికీతలుపు దించుతూ అన్నాడు:

"ఒక్క క్షణముండు, నా కొడుకును పంపుతా. వాడు దోవ చూపిస్తాడు".

వ్లాడిమిర్ కాచుకున్నాడు. ఒక నిమిష మయిందో లేదో, మళ్ళీ కిటికీ తలుపు తట్టాడు. కిటికీ తెరచుకుంది. మళ్ళీ ముసలివాడి గడ్డం బయటికి తొంగి చూసింది.

"ఏం కావాలి ?"

"నీ కొడుకేడీ ?"

"వస్తున్నాడు. బూట్లు తొడుక్కుంటున్నాడు. చలి వేస్తూంటే లోపలికివచ్చి ఒళ్ళు వెచ్చచేసుకోండి బాబూ".

"వద్దు, మీవాణ్ణి త్వరగా రమ్మను".

గుడిసె తలుపు కిర్రుమనింది. చేత్తో కర్ర పట్టు కొని ఒక యువకుడు బయటికివచ్చాడు. యువకుడు దోవచూపుతూ ముందు నడుస్తున్నాడు. ఒకొక్కసారి ఆగి, మంచులో పూడిపోయిన రోడ్డుకోసం వెదుకు తున్నాడు. వ్లాడిమిర్ "టైమెంతయింది ?"అని అడిగాడు.

"ఎంతయిందేమిటి ? త్వరలో తెల్లవారబోతూ వుంటే". తరువాత వ్లాడిమిర్ మాట్లాడలేదు.

వారు జాద్రినో చేరేసరికి కోళ్ళు కూస్తున్నాయి. చీకటి విచ్చుతోంది. చర్చి తాళంవేసివుంది. వ్లాడిమిర్ యువకునికి డబ్బిచ్చి ఫాదరీ ఇంటికివెళ్ళాడు. ఇంటిముందు తన స్లెడ్జి కనపడలేదు.

తనకోసం ఏమి దుర్వార్త కాచుకొనివుందో !

"కావచ్చమ్మా!" అంది మాషా. ఆ రోజంతా మామూలుగానే జరిగిపోయింది. కాని ఆరాత్రే మాషాకు జ్వరం తగిలింది. దగ్గరున్న పట్నంలోని డాక్టరుకు చెప్పి పంపించారు. మరుసటిరోజు సాయంత్రం అతనువచ్చేసరికి, రోగి సన్నిపాతంలో ఏదో తెగవాగుతూ వుంది. ఒళ్లు పేలిపోయ్యేలా జ్వరం కాస్తూ వుంది. మార్యా చావు బ్రతుకులమధ్య రెండువారాలపాటుంది.

మార్యా లేచిపోయే ఏర్పాట్లు జరిగాయని ఇంట్లో ఎవరికీ తెలీదు. అంతకుముందు రోజు సాయంత్రం రాసిన జాబులన్నీ కాల్చివేయబడ్డాయి. మాషా పని మనిషి ఈ విషయం ఒక్కమాటకూడ ఎవరితోనూ అన లేదు- యజమాని ఆగ్రహానికి భయపడి. పాదరీ, రిట యరయిన సైనికోద్యోగి, బుర్రమీసాల సర్వేయరు, యుల్హాన్ దళంలో చేరిన యువకుడు-ఎవరంతకువారు తేలుకుట్టిన దొంగల్లా ఈ విషయం ఎక్కడా అనుకో లేదు. బండి మనిషి పెరెష్కా, తాగిన మత్తులో కూడ ఒక్కమాట నోటనుండి బయటికి రాలేదు. కాబట్టి అర డజను మందికి పైగా తెలిసిన ఈ రహస్యం బయటికి పొక్కలేదు. కాని ఆ అమ్మాయే సన్నిపాతంలో వదరు పుట్టినప్పుడు, రహస్యంకాస్తా బయటపెట్టింది. కాని ఆమె మాటవినీ వినపడనంత అస్పష్టంగా వున్నందువల్ల, రాత్రింబగళ్ళు ఆమె మంచం వదలకుండా ఉపచారం

చేస్తూన్న తల్లికి మాత్రమే కొద్ది కొద్దిగా అర్థమయింది. ఆమె ఐనా, తన కూతురి పంచప్రాణాలూ వ్లాడిమిర్ కొలయవిచ్‌లో వున్నాయనీ, బహుశా ఈ ప్రేమే ఈ జబ్బుకు మూలకారణమయి వుంటుందనీ మాత్రమే గ్రహించగలిగింది. పెట్రోవ్నా, భర్తనూ, కొంతమంది ఇరుగు పొరుగు వాళ్ళనూ సంప్రదించింది. తుదకు అంత మంది కలిసి మార్యా గవ్రిలోవ్నా భవిష్యత్తును దేవుడే నిర్ణయం చేసేశాడనీ, విధినిర్ణయం ఎవరూ తప్పించలేరనీ పిల్లవాడు ముఖ్యంకాని, ముల్లెలు శాశ్వతంకాదనీ వగైరా వగైరా విషయాలను తేల్చివేశారు. మన చేతలు సహేతుకంగా లేనపుడు నీతిసూత్రాలు ఎంతో ఉప యోగ పడుతాయి.

ఈలోగా పిల్ల క్రమంగా తేరుకొన్నది. వ్లాడిమిర్, గవ్రిలా గవ్రిలోవిచ్ ఇంటికిరాక చాలాకాలమయింది. ఇంటియజమానురాలు తనపట్ల చూపుతూవచ్చిన ఔదా సీన్యంవల్ల అత నాఇంటిగడప తొక్కడమే మానేశాడు. ఇప్పుడతనికోసం కబురంపారు. మార్యాను అతనికిచ్చి పెండ్లి చేయడానికి తాము సిద్ధంగా ఉన్నామనే శుభ వార్త అతనికి పంపించారు. కాని ఆ యువకుడు పంపిం చిన తలతిక్క సమాధానం నెనరదోవా ఎస్టేటుదారులకు దిగ్భ్రమ కొల్పింది. అతను పంపించిన సమాధానమిది "నేనెప్పుడూ మీ ఇంటి గడప తొక్కనని మీకు హామీ

ఇస్తున్నాను. ఆశతో మృత్యువుకోసం ఎదురు తెన్నులు చూస్తూన్న ఒక అభాగ్యజీవిని మరచిపొండి." తరువాత కొన్నాళ్ళకు అతను మళ్లీ తన దళానికి తిరిగి వెళ్ళాడని సమాచార మందింది. ఇదంతా జరిగింది 1812 లో.

ఆరోగ్యం కోలుకొంటున్న మాషా చెవిలో ఈ సంగతి వేసేందుకు ఎవరికీ ధైర్యం చాలలేదు, చాలా రోజులవరకు. ఆమెకూడ వ్లాడిమిర్ పేరెత్తలేదు. కొన్ని నెలలయిన తరువాత బొరొడినో యుద్ధరంగంలో ప్రమాదకరమయిన గాయాలుతగిలి, ధైర్యసాహసాలకు ప్రభుత్వ ప్రశంసలందుకొన్న వాళ్ల జాబితాలో వ్లాడిమిర్ పేరు కనపడడంతో, మార్యా మూర్ఛపోయింది. మళ్ళీజ్వరం తగులుతుందని అందరూ భయపడ్డారు. కాని దేవునిదయ వల్ల, మరేమీ దుష్ఫలితాలు కలుగ లేదు.

అనతికాలంలో మరొక సంఘటన ఆమెను దుఃఖ సాగరంలో ముంచింది. ఆమెతండ్రి కాలధర్మం చెందాడు. ఆస్తికంతటికీ ఆమె అధికారిణి అయింది. కాని తనకు సంక్రమించిన ఆస్తిపాస్తులవల్ల మార్యాకిపుడు దుఃఖోపశమనం కలుగ లేదు. పాపం భర్తృవియోగంతో కుంగిపోతున్న తన తల్లి ప్రస్కోవ్యా పెట్రోవ్నాను కౌగిలించుకొని ఎప్పటికీ ఆమెను వదలి వెళ్ళనని మార్యా శపథం చేసింది. పూర్వ స్మృతులతో గుండెల్లో కుంపటి

రగిల్చి నెవరదాన్ నుండి తరలిపోయి వాళ్ళు తమ ఎస్టేటులోని 'అ' గ్రామంలో కాపురం పెట్టారు.

ఇక్కడకూడ, పెద్ద ఆస్తికి వారసురాలూ, అందాలరాణి అయిన మార్యా చుట్టూ ఎంతోమంది యువకులు మూగారు. కాని మార్యా ఎవరికీ పిసమెత్తు ప్రోత్సాహం యివ్వలేదు. తల్లికూడా పెళ్ళిచేసుకోమ్మని బిడ్డకు చాలాసార్లు చెప్పిచూచింది. అదికానిపని అన్నట్లు మార్యా తలఆడించి, ఏదో ఆలోచనలో పడిపోవడం తప్ప అందుకు బదులు చెప్పేదికాదు. వ్లాడిమిర్ కూడ నేడులేడు. ఫ్రెంచి సైన్యం ప్రవేశించేముందే అతను మాస్కోలో గతించాడు. మాషా అతని స్మృతి తన కతి పవిత్రంగా పరిగణించేది. ఏదిఏమైనా అతణ్ణి జ్ఞాపకంచేసే ప్రతి వస్తువును - అతనొకప్పుడు చదివిన పుస్తకాలు, గీచిన చిత్రాలు, తనకోసం ఎత్తిరాసినపద్యాలు, పాటలు, - భద్రంగా దాచివుంచింది. చుట్టుపట్ల వాళ్ళంతా, ఎంత అచంచలమైనప్రేమ! అని ఆశ్చర్యపడి, ఈ విషాదాను రాగబంధాన్ని ఛేదించి ఆమె హృదయపీఠాన్ని అధిష్టించగల అదృష్టశాలి ఎవడో చూడాలి అని ఉత్కంఠతో ప్రత్యక్షిస్తున్నారు.

ఇంతలో యుద్ధమయిపోయింది. మనం విజయలక్ష్మిని చేపట్టాం. విదేశాలనుండి మన సైన్యాలు తిరిగి వచ్చాయి. ప్రజలు తమ తమ ఇళ్ళనుండి బయటికి పరు

గెత్తివచ్చి విజయదుందుభులతో తిరిగివస్తున్న సైన్యాలకు నీరాజనా లిచ్చారు. మిలిటరీ బ్యాండు శత్రువులనుండి వశంచేసుకొన్న 'వైవ్ హెన్రీక్వాట్రే', 'లాజోకండె' వంటి పాటల ఖత్తులు వాయిస్తూ వచ్చింది. మీసకట్టు కూడ ఏర్పడని వయస్సులో యుద్ధాని కెళ్ళిన యువకులు రణరంగ వాతావరణంలో పెద్దవాళ్ళయి ధైర్య సాహసాలకు ప్రభుత్వం బహూకరించిన పతకాలతో తిరిగి వచ్చారు. సైనికులు ఒకరితో ఒకరు చెప్పుకునే కబుర్లలో ఫ్రెంచి, జర్మన్ పదాలు దొర్లేవి. మనజాతి వైభవోత్సాహాలు వెల్లివిరిసిన రోజులవి! 'స్వదేశం' అనే మాట విన్నప్పుడు రష్యా హృదయం ఎంత ఉప్పొంగిపోయ్యేది! ఆత్మీయుల పునస్సమాగమంతో పెల్లుబికే ఆనందాశ్రువులెంత మధురమయినవి! జాతీయాభిమానం – జారుపై ప్రేమ – ఈ రెంటిని మేళవించడంతో మనలో ఎంత ఏకాభిప్రాయముండేది! అవి మనకెలాంటి మధురక్షణాలు!

ఇక స్త్రీలా, రష్యా స్త్రీల కారోజుల్లో ఎవరుసాటి? బిర్రబిగుసుకొనివుండే వాళ్ళ స్వభావం ఏమయిందో ఆనాడు! కవి అన్నట్టు.

“అదిగదిగో! మన వీరులవి, శిరస్త్రాణాలు
అతివ లెగరేసి, చేసిరి జయధ్వానాలు!” [8]

విజేతల కెదురేగినపుడు వాళ్ళ ఉత్సాహం గుండెలను పులకరింపచేసే మధువులా ఉండేది. జీవితంలో తాను

పొందిన మహత్తరానుభూతి బహుశాకృతికి ఏదో ఒక రష్యా వనితకు కృతజ్ఞుడుకాని ఆఫీసర్లు ఆ రోజుల్లో మన దేశంలో ఉన్నాడా ?

మరపురాని ఆ రోజుల్లో మార్యా గ్రవిలోవ్నా తల్లితోపాటు 'అ' గ్రామంలోనే వుండిపోయి, రాజధానీ నగరాలు రెండూ సైన్య పునరాగమనోత్సవం ఎలా జరుపుకొన్నాయో చూడలేదు పాపం. కాని దేశంలో ఆబాలగోపాలమూ వ్యాపించిన ఈ ఉత్సాహం నగరాల్లో కన్న జనపదాల్లోనూ, పల్లెల్లోనూ మరింత ఎక్కువగా ఉండేదని చెప్పవచ్చు. అలాంటిచోట్ల యూనిఫారంలో ఒక మిలిటరీ ఆఫీసరు ప్రత్యక్షమయ్యాడంటే యిక అతని కెదురులేదు. మామూలు సివిల్ దుస్తుల్లో వున్న ప్రేమికులకు చాలా గడ్డురోజు లవి.

మార్యాగ్రవిలోవ్నా కన్నెత్తి చూడకపోయినా ఆమెను చేపట్టాలని వుబలాటపడే యువకు లనేకులు ఆమెచుట్టూ చేరారని ఇదివరకే చెప్పాము. కాని బర్మిన్ అనే ఒక హుస్సారుకర్నల్ జార్జిక్రాసుతో, రణరంగ లో తగిలిన గాయాలతో, కొద్దిగా పాలిన ముఖంతో (ఆ పాలడంకూడ ఆకర్షకంగా వుందని అక్కడి యువతుల అభిప్రాయం) మార్యాకోటలో ప్రత్యక్షమయ్యేసరికి ఆ యువకులందరూ కాలికిబుద్ధిచెప్పారు. బర్మిన్‌కు 26 ఏళ్లుంటాయి, అతని ఎస్టేటు మార్యా ఎస్టేటు పక్కనేవుంది.

బర్మిన్ సెలవుపై ఇంటికి వచ్చాడు. మార్యాగ్రవిలోవ్నా అతనిపట్ల కొంత ప్రత్యేకత కనపరచింది. అతను ఎదుట వున్నప్పుడు ఆమెలో మామూలుగా వుండే విషాద చ్ఛాయలు కొంత తొలగి ఉత్సాహం పొడసూపేది.

బర్మిన్ నిజంగా చాలా అందగాడు. మగవాడికి ఎలాంటి మనస్సు వుండాలని స్త్రీలు కోరుకుంటూ వుంటారో అలాంటి మనఃప్రవృత్తి అతనిది. అతనిలో నటన అనేది లేదు. వారిపట్ల గౌరవం, శ్రద్ధ చూపడం, వారిని కొద్దిగా వేళాకోళం చేయడం బర్మిన్‌కు నైజం! మార్యా సమక్షంలో అతను ఎగ్గులేకుండా చనువుగా ఉండేవాడు. అయితే, ఆమె ఏమి చేసినా, ఏమి మాట్లాడినా అతని చూపులూ, ఆలోచనలూ ఆమెను వెంటాడేవి. హానంగా, ఎంతో పెద్దమనిషి తరహాగా కనపడినప్పటికి ఒకప్పుడు విషయలోలుడై స్వేచ్ఛగా తిరిగాడని ఆనోట ఈనోటా వినవస్తూవుండేది. కాని ఇందు మూలంగా మార్యా గ్రవిలోవ్నా కతనియందు గల అభిమానం తగ్గలేదు. అందరిస్త్రీలలాగా మార్యాకూడా సాహస, యావనోద్వేగాలవల్ల మగవాళ్ళుచేసే అల్లరి పనులను హృదయపూర్తిగా మన్నించింది.

కాని అన్నిటికన్న అతని పెద్దమనిషితరహా, మధుర వీంభాషణ, అపూర్వ ముఖపాండిమ, కట్టుకట్టినచేయి సటన్నిటికన్నా అతని మితభాషిత్వం ఆమె కేతుకాన్ని

రేకెత్తించి ఆమె హృదయాన్ని స్పృశింపజేసాయి. తానతన్ని చాలా ఆకర్షించాననే విషయంకూడ గమనించకుండా వుండలేకపోయింది. అతనుకూడ, తెలివి తేటలు, అనుభవం వున్నవాడుకాబట్టి, తనంటే ఆమెకు ఇష్టమనేవిషయం గుర్తించాడు. అయితే అతనెందుకు తన పాదాలవద్ద మోకరిల్లి తన ప్రేమను నివేదించ లేదింకా? అతణ్ణి అడ్డుపెడుతున్నదేమి? నిజమైనప్రేమను సన్నంటివుండే అధైర్యమా? లేక గర్వమా? స్త్రీ లోలుని జిత్తులా! అతని విషయం ఆమెకూ అయోమయంగావుంది. ఎంతో ఆలోచించిన తరువాత అతని మౌనముద్రకు అధైర్యమే కారణమని మార్యా నిర్ధారణ చేసింది. అతనిపట్ల మరింత శ్రద్ధాశక్తులు చూపాలనీ, సమయంవస్తే, కొంత అనురాగంకూడా చూపించి అతణ్ణి ప్రోత్సహించాలని అనుకొంది.

ఇలా అన్ని సన్నాహాలు చేసి, అతను ఎప్పుడు ప్రేమభిక్ష తనముందు అంజలిస్తాడా అని మార్యా ఆదుర్దాతో ఎదురు చూస్తోంది.

చేతిలో పుస్తకం, తెల్లని గౌను — అంతా నవల లోని నాయికలా ఉంది. మామూలు కుశలప్రశ్నల తరువాత మార్యా అదేపనిగా మాటలు సాగనీలేదు. ఇందువల్ల యిద్దరూ యిరుకులోపడి తబ్బిబ్బు హెచ్చింది. ఈ పరిస్థితుల్లో బర్మిన్ మనస్సు దృఢంచేసుకొని హఠా

త్తుగా గుండె గుమ్మరించడ మొకటే శరణ్యం. అప్పుడు ఇలా జరిగింది. తాను ఇరుకులోపడ్డానని గ్రహించిన బర్మిన్ మెల్లగా యిలా అన్నాడు:

"నా హృదయం నీకు విప్పిచెప్పాలని చాలా రోజులుగా అనుకొంటూ తగిన సమయంకోసం కాచుకొని వున్నాను. క్షణంసేపు చెవి ఒగ్గి యిలా వింటావా?"

మార్యా పుస్తకం మూసిపెట్టి కానిమ్మన్నట్టు కళ్ళుక్రిందికి దించింది.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను; నా మనసారా ప్రేమిస్తున్నాను" అని అన్నాడు బర్మిన్ (మార్యాముఖం సిగ్గుతో కెంపెక్కింది. తల మరింత క్రిందికి వాల్చింది). నిన్ను చూడడం, నీ పలుకులు వినడం అనే మధురానుభూతికి లోలుణ్ణయిపోయి తప్పుచేశాను ........."
(మార్యాకు సెయింట్ ప్రే ప్రథమ ప్రేమ లేఖ జ్ఞప్తికి వచ్చింది.)
"నా నుదుట రాసినరాత ఇక కాదనడం సాధ్యం కాదు. నీ స్మృతి నీ మధుర మోహనమూర్తి నన్ను జీవితాంతంవరకు వేధిస్తూ వుంటుంది. నాకిక మిగిలిన ఆనందమూ అదే. కాని నేను ఒక విధ్యుక్తధర్మం నెరవేర్చవలసి వుంది – ఒక భయంకర రహస్య మొకటి నీకు చెప్పాలి.అది మనిద్దరినీ ఒక హిమాలయ పర్వతంలా వేరుచేస్తుంది....."

మార్యా ఆత్రంగా అడ్డుతగిలింది. "అది ఎప్పుడూ వుండనే వుంది...నేను నిన్ను పెళ్ళాడడ మసంభవం..."

"నాకు తెలుసు" అని బర్మిన్ మెల్లగా అన్నాడు: నీ వొకప్పుడు మరొకరిని ప్రేమించావని నాకు తెలీదా? తెలుసు......... కాని మృత్యువు, మూడేండ్లుగా దుఃఖం......నా చిన్నారి మార్యా గవ్రిలోవ్నా... నన్ను సుఖపెట్టడానికి అంగీకరించివుండేదానివే ననే నమ్మకంతో......దయవుంచి మాట్లాడవద్దు... నీవు నా హృదయాన్ని దహిస్తున్నావు...నీవు నా రాణివయ్యేదానికేనని నాకు తెలుసు...నా అంతరాత్మ అలా చెప్తూవుంది...కాని, నేను వట్టి నిర్భాగ్యుణ్ణి... నాకు పెళ్ళయింది!"

మార్యా ఆశ్చర్యచకితురాలై కళ్ళెత్తి అతనివైపు చూచింది.

బర్మిన్ మళ్ళీ అందుకొన్నాడు. "నాకు పెళ్ళయింది. పెళ్ళిఅయి 4 ఏండ్లు కావస్తుంది. నాభార్య ఎవరో, ఆమె ఎక్కడుందో, నే నామెను ఎప్పుడైనా కలుసుకొంటానో లేదో నాకు తెలీదు...!"

"ఏమి? ఎంత విచిత్రంగా వుంది" అని మార్యా విస్తుపోయి అంది. "కానీ సంగతి పూర్తిగా చెప్పు; నేను తరువాత చెప్తాలే... నీ పుణ్యముంటుంది. కానియ్యి చెప్పు."

బర్మిన్ ఇలా అన్నాడు :

"1812 వ సంవత్సర ప్రారంభంలో నేను విల్నాకు వెడుతున్నాను. మా పటాలం అప్పుడక్కడ ఉంది. ఒక నాటి సాయంత్రం పొద్దుపోయిన తరువాత ఒక మజిలీ చేరాను. కొత్తగుర్రాలు వెంటనే సిద్ధంగావుంచవలసిందిగా ఆజ్ఞాపించాను గాని ఉన్నట్టుండి ఒక పెద్దతుపాను లేచింది. మజిలీ అధికారి, బండి మనుషులు, తుపాను తగ్గేవరకు ప్రయాణ మాపడం మంచిదన్నారు. వారిసలహా పాటించి ఆగాను. కాని మనస్సు గుబులు గుబులుగా వుంది. దోవ పట్టమనినన్నెదో తొందర పెడుతూవుంది. తుపానుఉధృతి ఏమాత్రం తగ్గలేదు. వెంటనే స్లెడ్జికి గుర్రాలు కట్టించు కొని తుపానులోనే బయలుదేరాను. బండివాడు స్లెడ్జిని నదిపక్కగా పోనిచ్చాడు. అలాపోతే రెండుమైళ్ళు కలసి వస్తుందని. గట్లపై మంచు పేరుకొని వుంది. మేము మళ్ళీ రోడ్డు చేరుకోవలసిన స్థలందాటి వెళ్ళినందువల్ల దోవ తప్పాము. ఎక్కడున్నామో తెలీలేదు. తుపానుతగ్గే సూచనలు కనిపించడంలేదు. దూరంగా ఒక దీపం కన పడుతూ వుంది.

బండి అక్కడికి పోనిమ్మన్నాను డ్రైవరుతో. పోగాపోగా, ఒక పల్లెదగ్గరికి వచ్చాము. కర్రతో కట్టిన చర్చిలో దీపం వెలుతుురు కనపడుతూవుంది. తలుపు తీసి వుంది. కాంపౌండులో కొన్నిస్లెడ్జిలు వున్నాయి. కొంత

మంది జనం సింహద్వారంముందు అటు ఇటూ తిరుగు తున్నారు. "ఇటు! ఇటు!" అని ఒక్కసారిగా పలువురు నన్ను పిల్చారు. "ఎందుకింత ఆలస్యం చేశావు" అని ఎవరో అడిగారు. "వధువు మూర్ఛపోయే స్థితిలో ఉంది. ఏమి చేయాలో తెలీక ఫాదరీ దిగులుపడుతున్నాడు. మేము యింటికి వెళ్ళిపోదా మనుకొంటున్నాం. రా, రా, త్వరగా కానిస్తాం" అన్నాడు. నేను స్లెడ్జినుండి ఒక్క గంతు వేశాను. ఒక్క మాటకూడ బదులు చెప్పకుండా చర్చిలోకి వెళ్ళాను. అక్కడ కొన్ని కొవ్వొత్తులు వెలుగుతూ వున్నాయి. చీకట్లో ఒక మూలలో ఒక బెంచిపై ఒక అమ్మాయి కూర్చొని వుంది. ఇంకొక అమ్మాయి ఆ కూర్చున్నామె కణతలు రుద్దుతూవుంది. నేనురాగానే ఆమె ఇలా అంది: "మీ పుణ్యం మంచిది. సమయానికి సరిగ్గా వచ్చారు. మా దొరసానిని చంపేంత పని చేసారు." ఒక ముసలి ఫాదరీ నన్ను సమీపించి, "ఇక ప్రారంభిద్దామా" అని అడిగాడు. "కానీండి ఫాదర్, కానీండి" అని ఏదో మగతలో వున్నవానిలా అన్నాను. ఆ అమ్మాయిని యెత్తి కాళ్ళపై నిల్చోబెట్టారు. చాలా అందంగా వున్నట్టు కనపడింది...క్షమించరాని చిలిపిచేష్ట ఎందుకిలా చేశానో అడిగితే చెప్పలేనిప్పుడు, కాని క్షమించరాని చిలిపిచేష్ట అది. వేదికవద్ద ఆ పక్కన నిల బడ్డాను. ఫాదరీ చాలా తొందరలో వున్నాడు. ఆ

ముగ్గురు మొగవారూ, ఆ పసిపిల్ల పెళ్ళికూతుర్ని కింద పడకుండా పట్టుకోవడంలో నిమగ్నమైవున్నారు. వారికింక దేనిపైన గమనం లేదు. "మీరు భార్యా భర్తలయ్యారు. ముద్దుపెట్టుకోండి" అని అన్నారు వారు. నా భార్య పాలిన తన ముఖం నా వైపు త్రిప్పింది. నేను ముద్దు పెట్టుకోబొయ్యే సమయంలో ఆ అమ్మాయి "ఇతను కాదు! ఇతను కాదు!" అని అరచి తెలివి తప్పి పడిపోయింది. సాక్షులు నా వైపు ఎగాదిగా చూచారు. నేను వెనుదిరిగి చరచర చర్చి బయటికి ఒక్క దూకులో నా స్లెడ్జిలో వచ్చిపడ్డాను. "పోనీ" అని అన్నాను బండివాడితో. నన్ను ఎవ్వరూ వచ్చి అడ్డగించ లేదు.

"అయ్యో దేవుడా!" అని మార్యా అరచింది. అయితే పాపం నీ పెళ్ళాంగతి ఏమయిందో నీకు తెలీదన్న మాట!"

"లేదు. నాకు పెళ్ళయిన ఆ వూరుపేరు తెలీదు. నేను ఏ మజిలీనుంచి బయలుదేరానో కూడా నాకు గుర్తులేదు. ఇదొక పెద్దవిషయంగా లెక్కచేయ లేదు. నేను చర్చి వదలిన మరుక్షణంలోనే స్లెడ్జిలోపడి నిద్రపొయ్యాను. మరుసటిరోజు వుదయం మూడవ మజిలీ చేరేవరకు నాకు మెలకువ రాలేదు. నా దుడుకు చేష్టకెంత మాత్రం ప్రాధాన్య మిచ్చానో దీన్నించి అర్థమవుతుంది. అప్పుడు నా వెంటవున్న నౌకరు యుద్ధంలో చని

పోయ్యాడు. కాబట్టి ఆ అమ్మాయి ఎవరో కనుక్కొనే అవకాశం లేదు. నే నామెను అంత అమానుషంగా పరిహాసం చేసినందుకు నా కీనాడు తగిన శాస్తి జరుగుతోంది."

"అయ్యో భగవంతుడా!" అని మార్యా గద్గదస్వరంతో అతనిని పట్టుకొంది. "అయితే ఆ వ్యక్తి నీవేనా? నీవు నన్ను గుర్తించనేలేదు."

బర్మిన్ ముఖంలో రక్తంలేదు. అక్కడే మార్యా పాదాలపై బడ్డాడు.

# అంత్యక్రియల నిర్వాహకుడు





ఎటుచూచిన కనిపిస్తున్నవి శవపేటికలు,
ఏండ్లు పైబడిన లోకం నెరసిన వెంట్రుకలు?

— డెర్జావిన్ [9]

ఇల్లు మార్చిన అంత్య క్రియల నిర్వాహకుడు ఏడ్రియన్ పాత ఇంట్లో ఇంకా మిగిలిన జోకీబొత్తె శవ పేటికలు తీసుకెళ్ళే తన బండి కెక్కించాడు. బండికి కట్టిన బక్కగుర్రాలు బస్మన్నయా వీదినుండి ఏడ్రియన్ కొత్త ఇల్లుండే నికిట్స్కయా వీధికి కాళ్ళీడ్చుకొంటూ నాల్గోసారి బయలుదేరాయి. ఏడ్రియన్ కొట్టుకు తాళంవేసి ఇల్లు 'అద్దెకైనా ఖరీదుకైన ఇవ్వబడుతుంది' అని రాసిన ఒక బోర్డును తలుపుపై మేకులతో బిగించి కొత్తింటికి నడుచుకొంటూ వెళ్ళాడు. ఆ ఇల్లు కొనాలని అతనికి చాలా ఉంది. చివరకు ఈ నాటికా కోరిక తీరింది. అందుకతను చెల్లించిన మొత్తం చిన్నదేం

కాదు. కాని ఏడ్రియన్ తన కొత్త ఇంటి పసుపు పచ్చని గోడలను సమీపించే సరికి తనకు కొంచెం కూడ సంతోషం కలగనందుకు ఆశ్చర్యమయింది. తనకింకా కొత్తగావున్న గడపదాటి ఇంట్లోకి వెళ్ళాడు. సామానింకా సర్దలేదు. ఇల్లంతా గందరగోళంగావుంది. 18 ఏండ్లుగా పూచిక పుల్లతో కూడ, ఎక్కడ వుండవలసిన సామాను అక్కడ వుంటూవుండిన తన పాత మట్టికొంప జ్ఞప్తికి వచ్చి దీర్ఘంగా నిట్టూర్చాడు. 'ఏమింత నిదానంగా పనిచేస్తున్నారు' అని పనిమనిషిని కూతుళ్ళ నిద్దరినీ, కసురుకొని సామాను సర్దడంలో సాయానికి తోడ్పడ్డాడు. ఇల్లు చక్కపెట్టడం త్వరగానే పూర్తి అయింది. దేవుని మందసం, పింగాణీ సామానూ, బీరువా, బల్ల, పడకకుర్చీ, మంచాలు, ఇవన్నీ వెనక గదిలో ఏ మూల ఏది ఎలా వుండాలో అలా సర్దారు. ఇంక ఇంటి యజమాని ముఖ్యమైన ఆస్తి – రంగురంగుల శవపేటికలు, అంత్యక్రియల సందర్భంలో ఉపయోగించే నల్ల హాట్లు, అంగవస్త్రాలూ, దివిటీలు – ఇవన్నీ వంట ఇంట్లోనూ, ముందర గదిలోను పేర్చిపెట్టారు. దివిటీని తల్లక్రిందుగా పట్టుకొన్న ఒక మన్మథుని బొమ్మగల బోర్డును ఇంటిముందు గేటుకు తగిలించారు. ఆ బొమ్మకింద 'శవపేటికలు, మామూలువి, రంగువేసినవి, ముసుగు గుడ్డలతో సహా ఇక్కడ అద్దెకుగాని, ఖరీదుకుగాని దొరుకు

తాయి. పాత శవ పేటికలు రిపేరుకూడ చేయబడు తాయి' అని రాసివుంది.

పనంతా ముగిసిన తరువాత, ఏడ్రియన్ కూతు ళ్ళిద్దరూ తమగదిలోకి వెళ్ళిపోయ్యారు. ఏడ్రియన్ ఇంటి నొకసారి తనిఖీ చేసివచ్చి కిటికీవద్ద కుర్చీలో కూర్చొని "సి మొవార్ వేడిచేయమని" పనిమనిషికి చెప్పాడు.

కాటి కాపరులు చీకు చింత లేని కబుర్లరాయు ళ్ళుగా షేక్ స్పియరు, సర్ వాల్టర్ స్కాట్ గామ రచనల్లో చిత్రించారు. వారి వృత్తికి, వారి ప్రకృతికి, మధ్యగల వైపరీత్యంతో రసపోషణచేసి పాఠకులను ఉత్సాహపరచాలని వారలా చిత్రించారు. కాని, సత్యాన్ని పోషించదలచుకొన్న మేము, ఈ సందర్భంలో వీరిని అనుకరించ లేక పోతున్నాము. మేము పేర్కొం టున్న అపరక్రియల నిర్వాహకుని స్వభావం అతని వృత్తికి అనుగుణ్యంగానే వున్నదని మేము అంగీకరించక తప్పదు. ఏడ్రియన్ ఎప్పుడూ మొగం వేల వేసుకొని విచారంగా వుంటాడు. అతను మాట్లాడడమే అరుదు. తన కూతుళ్ళు దోవన పొయ్యేవాళ్ళను కిటికిగుండా చూచు కొంటూ వూరికే నిల్చొని వుండడాని కలవాటుపడితే వాళ్ళను మందలించడానికో లేక తన కొట్టులోని వస్తు వులు కావలసి వచ్చిన దురదృష్టవంతులనుండి (సంద ర్భాన్నిబట్టి వాళ్ళు అదృష్టవంతులైన కావచ్చు) ఇంకా

నాలుగు డబ్బులు గుంజడానికో, తప్ప ఇతరత్రా అతను నోరును తెరచేవాడే కాదు.

ఏడ్రియన్ టీ తాగుతూ మామూలులాగే ఏదో చింతచేస్తూ కూర్చున్నాడు. ఆరు కప్పులు అయిపోయింది. ఏడోది తాగుతున్నాడు. రిటైరయిన బ్రిగేడియర్ శవాన్ని గడచినవారం తీసుకొని పోతూంటే, ఊరేగింపు సరిగ్గా టోల్ గేట్ దగ్గరకు వచ్చినప్పుడు కుండపోతగా వర్షం ప్రారంభమయిన సంగతెందుకో అతనికి జ్ఞప్తికి వచ్చింది. శవపేటిక వెంట వస్తున్న వాళ్ళందరి అంగవస్త్రాలు తడిసి ముద్దయినాయి. చాలా మంది హాట్ల అంచులు వంకరలు పోయినాయి. బ్రిగేడియర్ అంత్యక్రియలకు తాను సప్లయిచేసిన యీహాట్లు, అంగవస్త్రాలు పాతసరుకయినందువల్ల వర్షంలో బాగా దెబ్బతిన్నాయి. వాటి రిపేరీకి చేతినుంచి కొంతడబ్బు వదలుతుందని ఏడ్రియన్ అనుకొన్నాడు. ఒక్క సంవత్సరంనుంచి కాటికికాలు జాచుకొనివున్న ముసలి ముండ ట్రుఖినా చస్తే ఈ నష్టం పూడ్చుకోవచ్చు. అయితే ట్రుఖినా రజ్‌గుల్యావద్ద మంచంలో పడివుంది. ఆ ముసలిదాని వారసులు అంతదూరంనుంచి తనకోసం చెప్పి పంపారేమో అనే భయం ఏడ్రియన్‌కు పట్టుకొంది. బహుశా వాళ్ళు దగ్గరున్నా మరే కంట్రాక్టరుతో నైనా ఒప్పందం చేసుకోవచ్చు.

ఎవరో వీధి తలుపు మూడుసార్లు తట్టడంతో ఏడ్రియన్ ఆలోచనలు మధ్యలో ఆగిపోయాయి. 'ఎవరది' అని అరచాడు. తలుపు తెరచుకొని ఒక కొత్త మనిషి లోపల ప్రవేశించాడు. అతనొక జర్మన్ వృత్తి కారుడని చూస్తూనే చెప్పవచ్చు. వచ్చీరాని రష్యన్ భాషలో ఇలా అన్నాడతను: "క్షమించండి. మీ పనికి అంతరాయం కలిగిస్తున్నానేమో. మీ పరిచయం చేసుకోవాలని వచ్చాను. నేను జోళ్ళు కుట్టే వాణ్ణి. నా పేరు గొట్లియబ్ స్క్యూల్ట్జ్. మీ కిటికీ నుంచి కనపడే ఆ ఎదిరింట్లోనే నా కాపరం. నా పెళ్ళయి రేపటికి ఇరవయిఐదు సంవత్సరాలు. మా వివాహ రజితోత్సవం జరుపుకొంటున్నాం. మీరూ, మీ కుమార్తెలూ రేపు మా యింటికి భోజనానికి రావాలి." ఏడ్రియన్ సరే తప్పక వస్తానని, అతణ్ణి కూర్చోబెట్టి కప్పు టీ పుచ్చుకొమ్మని బలవంతం చేశాడు. గొట్లియబ్ స్క్యూల్ట్జ్ కలియుగలుపుతనంవల్ల, ఇద్దరూ చిరకాల మిత్రుల్లా మాట్లాడుకోసాగారు.

"మీ వ్యాపారం ఎలా వుంది" అని ఏడ్రియన్ ప్రశ్నించాడు

"ఎలా ఉందని చెప్పను! ఈ రోజు గిరాకీ ఐతే రేపు మందం. ఒకే రకంగా ఉండి చావదు. మొత్తం పైన ఫరవాలేదు లెండి. కాని మావి మీ సరకుల్లాంటివి

కాదుగా. బతికివున్న వాళ్ళు జోళ్ళు లేకపోయినా జరుపు కొంటారు. చచ్చినవాళ్ళు శవపేటికలు లేకుండా జరుపు కొనలేరు కదా".

"నిజమే" అన్నాడు ఏడ్రియన్. "అయితే బతికి వున్న వాళ్ళవద్ద డబ్బు లేకుంటే ఒట్టికాళ్ళతోనే వుంటారు. మరి చచ్చిపోయిన బిచ్చగానికికూడ ఉత్తపుణ్యానికే శవ పేటిక సప్లయి కావలసిందే కదూ !"

ఇలా నడిచింది సంభాషణ. కొంత సేపటికి స్కూల్‌టజ్ లేచి సెలవు తీసుకొంటూ తాను వచ్చిన పని మరొకసారి ఏడ్రియన్‌కు జ్ఞప్తికిచేసి వెళ్ళిపోయాడు.

మరుసటిరోజు మధ్యాహ్నానికి ఏడ్రియన్, అతని కూతుళ్లిద్దరూ, తాము కొత్తగా కొన్న ఇంటి గేటు దాటి స్కూల్‌టజ్ ఇంటికి బయలుదేరారు. ఏడ్రియన్ ప్రొకొరోవ్ ధరించిన రష్యాదేశపు దుస్తుల్నికాని, కులినా, కార్యాలిద్దరూ యూరోపియన్ పద్ధతిలో ముస్తాబైన నైనంకాని నేనిక్కడ వర్ణించడంలేదు, ఆధు నిక నవలాకారుల్లాగ. అయితే, ఆ యువతులిద్దరూ ఇలాంటి ప్రత్యేక సమయాల్లో ధరించే పసుపువన్నె హేట్లుని, ఎర్రని స్లిప్పర్లను పేర్కొనడం అసందర్భంగా దనుకొంటాను.

గొట్లియబ్ స్కూల్‌టజ్ ఇంట్లోని చిన్నగది అతిథులతో నిండిపోయింది. వారిలో ఎక్కువమంది

జర్మన్ కాపురులు, వారి భార్యలూ, వారివద్ద వృత్తి నేర్చుకొనే యువకులూ; విందుకు వచ్చినవారిలో ఒక్క రష్యన్ ఉద్యోగి కూడా వున్నాడు. అతను పోలీస్ కానిస్టేబిల్ యుర్కో. అతనొక మామూలు కానిస్టేబిల్ అయినప్పటికీ ఇంటియజమాని అతణ్ణి ప్రత్యేకంగా ఆదరించాడు. యుర్కో—పెగొరెవ్‌స్కీ చిత్రించిన పోస్టుమాస్టరు లాగా ఇరవైఐదు ఏళ్ళుగా భయభక్తులతో ఉద్యోగం చేస్తూవున్నాడు. ఆ పురాతన రాజధానీ నగరం 1812 లో, అగ్నికి ఆహుతి అయినప్పుడు అతని పసుపుపచ్చని కాపలాబడ్డీ బూడిద అయిపోయింది. కాని శత్రుసైన్యాలను దేశంనుంచి తరిమివేసిన తరువాత, దాని స్థానే, తెల్లని డోరిక్ స్తంభాలతో బూడిదరంగువేసిన కొత్త బడ్డీ తలెత్తింది. యుర్కో దానిముందు మళ్ళీ మునుపటిలా సాయుధుడై పారా ప్రారంభించాడు.

నికిట్స్కి గేటుకు చుట్టుపట్ల కాపురముండే చాలామంది జర్మనులు అతనికి తెలుసు. వాళ్ళలో కొందరు తప్పతాగి ఆదివారాల్లో రాత్రిపూట ఆ బడ్డీలోనే గడపవలసి వచ్చేదికూడా. అతనితో తనకు ఏనాడైనా పనిపడక తప్పదని గ్రహించిన ఏడ్రియన్, అక్కడికివచ్చిన వెన్వెంటనే అతన్ని పరిచయం చేసుకున్నాడు. టేబిల్ ముందు అందరూ భోజనానికి కూర్చున్నప్పుడు, ఏడ్రియన్, యుర్కోలు ఎదురుబదురుగా కూర్చున్నారు. స్యూల్ట్జ్

దంపతులు, వాళ్ళ పదిహేనేళ్ళ కూతురు లాట్ చెన్, అతిథులతో కలసి భోజనం చేస్తూ మధ్యమధ్య అతిథులకు వడ్డిస్తూన్నారు. బీరు మంచినీళ్ళలా ప్రవహిస్తోంది. యుద్ధో పలుగురు తినేంత తిన్నాడు. ఏడ్రియన్ కూడా అతనికేమీ తీసిపోలేదు. అతిథులంతా జర్మన్ భాషలో మాట్లాడు కొంటున్నారు. రానురాను మాటల సందడి హెచ్చింది. హఠాత్తుగా స్కూల్‌టజ్ "ఒక్కమాట! ఇలా వినండి!" అని బిగ్గరగా అంటూ తారుపూసిన ఒక సీసా బిరడా తీసి "యోగ్యురాలు, నా లూయిసా ఆయురారోగ్యానికి!" అని అన్నాడు. షాంపేన్ బుసబుసమని నురగలు కక్కు తోంది. స్కూల్‌టజ్ లేచి సడిప్రాయంలో వున్న అర్థాంగి మొగం ముద్దుపెట్టుకొన్నాడు. అతిథులు యోగ్యురాలయిన లూయిసా ఆయురారోగ్యానికై గ్లాసు లెత్తి ఖాళీ చేశారు. "నా అతిథుల ఆరోగ్యానికి" అంటూ గృహస్తు ఇంకొక సీసా బిరడా తీశాడు. అతిథులు ప్రత్యభి వాద సూచికంగా గ్లాసులు నింపి ఖాళీ చేశారు. ఈ ధోరణిలో సీసాలుసీసాలు ఎగిరిపోయ్యాయి. అక్కడ చేరిన ప్రతిఒక్కరి ఆయురారోగ్యానికని, మాస్కో నగ రానికని, జర్మనీలోని ఒక డజన్ మామూలు పట్టణాల కని, అన్నివృత్తులకని, తరువాత ఫలానాఫలానా వృత్తి కని, వృత్తికారుల ఆరోగ్యానికని, వారిక్రింద శిక్షణ పొందేవారి ఆరోగ్యానికని తాగారు. ఏడ్రియన్ ఒక్క

టోస్టుకూడ విడిచిపెట్టకుండా బహు శ్రద్ధగా తాగాడు. తుదకు ఉత్సాహం పట్టలేక తనూ ఒక విచిత్రమైన టోస్టు ప్రతిపాదించాడు. అనంతరం ఒక స్థూలకాయుడయిన రొట్టెల వ్యాపారి లేచి తన గ్లాసునెత్తి "మన మెవరి కోసమని పనిచేస్తున్నామో వారికోసం" అని అన్నాడు. ఈ టోస్టూ అంతమంది సంతోషంగా తాగారు. తరువాత అతిథులు ఒకరికొకరు తలవంచి నమస్కరించుకోవడం ప్రారంభించారు. దర్జీ చర్మకారునికి నమస్కరించాడు. చర్మకారుడు దర్జీకి ప్రతినమస్కారం చేశాడు. రొట్టెలతను యిద్దరికీ నమస్కరించాడు అతిథులంతా కలసి రొట్టెలతనికి నమస్కరించారు. ఇలా సాగిపోయింది. ఈ నమస్కార కార్యక్రమ సందర్భంలో యుర్కో ఏడ్రియన్‌వైపు తిరిగి ఇలా అన్నాడు: "నీవు సాగనంపిన మృతుల ఆయురారోగ్యానికై తాగుదాం!" అందరూ విరగబడి నవ్వారు. ఏడ్రియన్ మాత్రం ముఖం చిట్లించాడు కోపంతో. కాని ఇదెవ్వరూ గమనించలేదు. గ్లాసులు నింపడం, ఖాళీచేయడం నిరాటంకంగా సాగిపోయింది. అతిథులు టేబిల్ నుంచి లేచేటప్పటికి సాయంత్రం ప్రార్థనలకు చర్చి గంటలు మోగుతున్నాయి.

అతిథులు వారివారి ఇళ్ళకు వెళ్ళిపోయారు. చాలా మంది పూర్తి నిషాలో వున్నారు. రొట్టెలతన్ని, బుక్

బైండరూ పోలీసుకానిస్టేబిలును చెరిఒకవైపు చంకల కింద చేయివేసి మెల్లగా అతని బస్తీకి నడిపించుకొని పొయ్యారు, తమ బాకీ చెల్లించివేశా మనుకొంటూ.

ఏడ్రియన్ సగంమత్తుతో, సగంకోపంతో ఇంటికి తిరిగి వచ్చాడు. "నావృత్తి ఇతర వృత్తులంత గౌరవ మయింది కాక పోయిందా? నేను పురితీసేవానితో సమానమా? నన్ను చూచి నవ్వడానికి ఈ విదేశీ యుల కేమి కనపడింది! నా గృహప్రవేశ సందర్భంలో వీళ్ళంతమందినీ పిల్చి విందుచేయా లనుకొన్నాము. ఛీ! ఛీ! ఈ అధవల్ని పిలవడం? నేను ఎవరికోసం పని చేస్తున్నానో ఆ క్రైస్తవ ప్రేతాలనే ఆహ్వానిస్తాను."

"అయ్యో! ఇదేమిటి బాబూ" అని ఏడ్రియన్ బూట్లు విప్పుతూ అంది పనిమనిషి ఆశ్చర్యంతో. "మీరు తెలిసే మాట్లాడుతున్నారా? చెంపలు వేసుకోండి! గృహప్రవేశానికి చచ్చినవాళ్ళను పిలవటమా? ఇంత కంటే ఘోరముందా?"

"దేవుని సాక్షిగా చెప్పుతున్నాను నేను. ఆపని చేసి తీరుతాను" అని ఏడ్రియన్ అన్నాడు. రేపే ఆ పని చేస్తాను. నాశ్రేయోభిలాషులారా! రేపు రాత్రి నాతో విందారగించి నన్ను ధన్యుణ్ణి చేయండి! ఈ పేదవాని కుండే సర్వస్వం మీదే!" ఈ మాటలని ఏడ్రియన్

మేను వాల్చాడో లేదో కొన్ని నిమిషాల్లోనే గురకలు పెట్ట నారంభించాడు.

ఏడ్రియన్‌కు మెలుకువ వచ్చేసరికి ఇంకా చీకటి విచ్చలేదు. ఆ వ్యాపారస్తుని భార్య, ట్రెయుఖినా రాత్రి మరణించింది ఆమె నౌకరొకడువచ్చి ఈవార్త ఏడ్రియనుకు తెలియజేశాడు. ఏడ్రియన్ ఓడ్కాకని పదికోపెక్కులు వాడిచేతిలోపెట్టి, తొందరగా బట్టలు వేసుకొని, ఒక గుర్రబ్బండి అద్దెకు తీసుకొని రజ్‌గుల్యాకు వెళ్ళాడు. పోలీసువాళ్ళను గేటువద్ద కాపలా వుంచారు. వ్యాపారస్తులు, పీనుక్కోసం కాచుక్కొన్న రాబందుల్లా ఇటూఅటూ పచారు చేస్తూన్నారు.

శవాన్ని బల్లపై పండబెట్టారు. ముఖం నల్లబడి పోయింది; ఐతే గుర్తుపట్టడానికి వీలులేనంత వికృత వికారంకాలేదు. బంధువులు, ఇరుగుపొరుగువారు, నౌకర్లు, చుట్టూచేరారు. కిటికీలన్నీ తెరిచివున్నాయి. గదిలో కొవ్వొత్తులు వెలుగుతున్నాయి. మతగురువులు విగతజీవుల ఆత్మశాంతికై చేసే ప్రార్థనలు పఠిస్తున్నారు.

ఏడ్రియన్, చనిపోయిన ముసలిదాని మరిదికొడుకు పరధ్యానంతో సరే మంచిదన్నాడు. డబ్బు విషయంలో బేరమాడదలచుకోలేదనీ, ఎందులోనూ లోపం చేయడనే నమ్మకంతో అన్ని ఏర్పాట్లు అతనికే వదలివేస్తున్నాననీ అన్నాడు. ఏడ్రియన్ తన అలవాటు ప్రకారం

ఒక్క చిల్లిగవ్వకూడ ఎక్కువ పుచ్చుకోనని ప్రమాణం చేసి ముసలిదాని మరణవార్త తెలియజేసిన నౌకరు ప్రసాదాభిప్రాయంగా చూచి, అపరక్రియల కవసరమయిన ఏర్పాట్లు చేయడానికి వెళ్ళిపోయాడు.

ఆ పగలంతా రజ్‌గుల్యా వనికట్‌స్కీ గేటు మధ్య గుర్రబ్బండిలో ఎన్నిసార్లు తిరిగాడో లెక్కలేదు. సాయంత్రానికి పని పూర్తి అయింది. బండివాడికి అద్దె ఇచ్చి పంపించివేసి కాలినడకన ఇంటికి బయలుదేరాడు.

అది వెన్నెలరాత్రి. ఏడ్రియన్ నికిట్‌స్కీ గేటు సురక్షితంగా చేరుకొన్నాడు. చర్చిదాటి వెడుతూండే సమయంలో పారాకాస్తున్న యుర్కో 'ఎవరది' అని కేకవేసి, వెంటనే ఏడ్రియన్‌ను గుర్తించి 'మీరా? గుడ్ నైట్' అన్నాడు. అప్పటికి చాలా పొద్దుపోయింది. ఏడ్రియన్ ఇంటిదగ్గరకు వస్తూన్నాడు. హఠాత్తుగా వీధిలో నుంచి ఎవరో, తన ఇంటి గేటు తీసుకొని లోపలికి వెళ్ళి నట్లు అతనికి తోచింది. ఎవరతను? ఈఅగాధవేళలో నాతో ఎవరికి పని వుంటుంది? రాత్రిళ్ళు, ఎవరైనా కుర్రకుంకలు నామతిమాలిన పిల్లల దగ్గరకు వచ్చిపోతు న్నారా ఏమిటి కొంపదీసి? తన స్నేహితుడు యుర్కోను సహాయానికి రమ్మని పిలుద్దామా అని కూడా అను కొన్నాడు. ఆ క్షణంలో ఇంకొకరు గేటు తీసుకొని లోపలి అడుగు పెట్టబోతూ, హడావుడిగా వస్తున్న

ఏడ్రియన్‌ను చూచి హాటు పైకెత్తి నమస్కరించాడు. ఏడ్రియన్ తొందరలో అతని ముఖం పరీక్షగా చూడ లేదు. అతణ్ణి తా నెక్కడనో చూచానని అనుకొన్నాడు. "మీరు నా కోసం వచ్చారా? లోపలికి దయచేయండి" అని ఎగపోసుకొంటూ అన్నాడు.

"మర్యాదపట్టింపు లెందుకు. మీరు మొదట వెళ్ళండి. అతిథులకు దారి చూపండి" ఏడ్రియన్ తానుండే హడా వుడిలో మర్యాదలనుగూర్చి ఆలోచించే స్థితిలో లేడు. గేటు గడియ తీసేవుంది. మెల్లెక్కి తలవాకిలి సమీపిం చాడు. అతిథి వెనుకనే వస్తున్నాడు. ఇంట్లో చాలా మంది ఇటూ అటూ తిరుగుతూన్నట్లు ఏడ్రియన్‌కు అని పించింది. "ఏమిటిదంతా?" అని అనుకొంటూ తలుపు తీసుకొని లోపలకడుగుపెట్టాడు ... కాళ్ళు గడగడ వడకాయి ... గదినిండా ప్రేతలు తిరుగుతున్నాయి. కిటికీగుండా లోపలపడుతున్న వెన్నెలవెలుగులో ప్రేతల పాలిపోయిన ముఖాలు, దిగజారిన నోళ్ళూ, కాంతి హీనమైన అరమోడ్పు కళ్ళూ, ఎత్తయిన ముక్కులూ కనబడుతున్నాయి ... గతంలో తాను ఎవరెవరిని పాతి పెట్టడానికి తోడ్పడ్డాడో వాళ్ళందరిని ఏడ్రియన్ గుర్తిం చాడు. అతని గుండెలు గుభేలుమన్నాయి. తనతో ఇంట్లోకి వచ్చినతను కుండపోతగా వర్షం కురుస్తూంటే, పాతిపెట్టిన బ్రిగేడియర్ అని ఏడ్రియన్ గుర్తించాడు.

ఏడ్రియన్ లోపలికి రాగానే, గదిలో చేరినవారంతా - స్త్రీలూ, పురుషులూ - ఏడ్రియన్ చుట్టూచేరి సమస్కారం చేసి పలుకరించారు. ఒక పేదవాడు మాత్రం నమ్రతతో గదిలో దూరంగా ఒకమూల నిల్చున్నాడు తన చిరిగిన గుడ్డలు చూచుకొని సిగ్గుపడుతున్నవానిలా. కొద్ది రోజులక్రితం ఏడ్రియన్ ఇతని శవాన్ని ఉచితంగా పాతిపెట్టవలసివచ్చింది. ఇతనొకడు తప్ప ఇతరులంతా మంచి మంచి దుస్తులు వేసుకొన్నారు. స్త్రీలంతా రిబ్బిమలమర్చిన టోపీలుధరించారు. అధికారులు యూనిఫారాలు ధరించారు. కాని వారి గడ్డాలు మాశాయి. వర్తకులు ఖరీదైన దుస్తులు వేసుకొన్నారు. అక్కడ చేరినవాళ్ళందరి తరఫున బ్రిగేడియరు, ఇలా అన్నారు:

"ప్రోఖరొవ్ గారూ, మీ ఆహ్వాన మంగీకరించి మేమంతా లేచివచ్చాము. పూర్తిగా శిథిలమై, వట్టి అస్థిపంజరాలుగా మిగిలిపోయి, నిస్సహాయస్థితిలో వున్నవారు మాత్రమే వెనుక నిల్చిపోయారు. కాని వారిలో ఒక్కతను మాత్రం మిమ్మల్ని చూచిపోవాలనే ఆదుర్దాకొద్ది రాకుండా వుండలేకపొయ్యాడు....."

ఇలా అంటూవుండగానే, ఒక చిన్న అస్థిపంజరం గుంపును ఇటూ అటూ తోసుకొంటూ ఏడ్రియన్‌ను సమీపించింది. చర్మ మాంసాలులేని అతని ముఖం ఆప్యాయతతో పళ్ళికిలించింది. పచ్చనీ, ఎర్రనీ గుడ్డ

పేలికలూ, పట్టుచొక్కా, ఎముకబొంగుకు తగిలించి నట్లుగా, ఆ ఎముకలగూడుకు అతుక్కొని వున్నాయి. దాని ముంగాలి ఎముకలు, ఎత్తైన గుర్రపుస్వారీ బూట్లతో పళపళమని శబ్దంచేస్తున్నాయి రోళ్లో రోకలిబండలా.

"ప్రొఖొరొవ్! నన్ను గుర్తించ లేదూ! గార్డు దళంలో రిటైర్డు సార్జంట్ పైటోర్ పెట్రొవిచ్ కురిల్కిన్ని. జ్ఞాపకం లేదూ? నీ మొట్టమొదటి శవపేటికను అమ్మింది నాకే. 1799 లో (అది ఓక్ కర్రతో చేసిందన్నావు కాని డీల్ కర్రతో చేసిందిలే)" ఇలా అంటూ ఆ అస్థి పంజరం ఏడ్రియన్ను కవుగలించుకోవడానికి తన చేతి ఎముక లెత్తింది. భయవిహ్వాలుడైన ఏడ్రియన్, తన బల మంతా కూడదీసుకొని గట్టిగా అరుస్తూ అతన్ని వెనక్కి తోశాడు. పైటోర్ పెట్రొవిచ్ తూలి, కీళ్ళు వదలి విడిపోయిన ఎముకలపోగై కిందపడ్డాడు. ప్రేతాలు ఆఁ ఆఁ అన్నాయి కోపోద్రేకంతో. పళ్లు కొరుకుతూ, తిడుతూ, నిస్నేం చేస్తామో చూడమని బెదరిస్తూ, తమ సహచరుని గౌరవం నిలబెట్టడానికై, ఏడ్రియన్ పైకి లేచాయి. చెవులు తూట్లుపడుతున్న వాటి అరుపులకు, ధాటికీ గుండెచెదిరి ఏడ్రియన్కు తెలివితప్పి సార్జెంట్ ఎముకలపైన ధభాలుమని పడిపోయాడు.

ఏడ్రియన్ మంచంపైన సూర్యకిరణాలు పడుతో న్నాయి. ఏడ్రియన్ కళ్ళు తెరచి చూచేటప్పటికి పని

మనిషి సామొవార్‌లో నిప్పులు రాజుకోడానికి వూదుతోంది. రాత్రి జరిగిన సంఘటనలు ఏడ్రియన్‌కు గుర్తుకొచ్చి గుండెజలదరించింది. ట్రియుఖినా, బ్రిగేడియర్, సార్జెంట్ కురిల్కిన్ అతని హృదయాంతరాళంలో తారాడుతున్నారు. రాత్రి జరిగిన సంఘటనల పరిణామం పనిమనిషే చెప్పనిమ్మని ఏడ్రియన్ మౌనంగా వున్నాడు.

"ఎంతసేపు నిద్రపోయారు బాబూ!" అని అక్సిన్యా ఏడ్రియన్‌కు ఉదయం చొక్కా అందిస్తూ అన్నది. "పక్కింటి దర్జీ ఆయన మిమ్మల్ని చూట్టానికి వచ్చారు. నేడు పోలీస్ ఇన్‌స్పెక్టరు నామదినమని చెప్పడానికి పోలీస్ కానిస్టేబిల్‌గారు వచ్చారు. కాని మీరు గాఢనిద్రలో వున్నందువల్ల మేము మిమ్మల్ని లేపలేదు."

"చనిపోయినట్టి ట్రియుఖినా ఇంటినుంచి ఎవరైనా నాకోసం వచ్చారా?"

"ట్రియుఖినా? ఎందుకు? ఆమె పోయిందా?"

"వట్టి మతిలేనిమనిషివి నీవు. ఆమె అపరక్రియలకు అన్నీ సిద్ధంచేయడానికి నిన్ననీవే నాకు తోడ్పడలేదు?"

"అయ్యో, బాబూ! మీకేమైన మతిపోయిందా ఏమిటి? లేక నిన్న పగలంతా కూర్చొని తాగిన మత్తు వదల్లేదా? నిన్న ఎవరి అంత్యక్రియలూ జరగలేదు.

నిన్న మీరు ఆ జర్మన్ వాళ్ళింట్లో జరిగిన విందుకెళ్ళి పూర్తి నిషాతో వచ్చారు. వచ్చీరావడంతో మంచం పైన పడి తెలివిలేకుండా నిద్రపోయారు. చర్చిగంటలు మోగడం ఇప్పుడే ఆగిపోయింది."

"అట్లనా ?" అన్నాడు ఏడ్రియన్ గుండె తేలికై.

"మ రేమిటి ?" అంది పని మనిషి.

"అయితే వెళ్ళి టీ కాచి, పిల్లల్ని పిలు."



*అత నొక మున్సిపల్ కౌన్సి లర్, ఒక మజిలీకి నిరంకు శాధికారి.*

## ప్రిన్స్ వ్యాజమ్‌స్కీ (11)

మజిలీ అధికారిని బండబూతులు తిట్టనివా డెవడు? అతనితో కొట్లాటకు వేసుకోని వా డెవడు ? ఆగ్రహా వేశంతో, 'ఆ కంప్లైయింటు పుస్తకం ఇలా తే' అని ఈ మజిలీ అధికారి లక్ష్యంలేని మనిషనీ, మర్యాదలేకుండా తన ఇష్టానుసారం ప్రవర్తించాడనీ, టైముకు సరిగా పని చేయడని ఎందుకూ కొరగాని మాటలు గోకని వా డెవ డంటా! మజిలీ అధికారులు నరరూప రాక్షసులనీ, భర్తరఫ్ అయిన ఆ ఫలానా అధికారులకన్న నికృష్టులనీ, ముదోం బందిపోటు దొంగల కేమీ తీసిపోడనీ, అవనీ, ఇవనీ ప్రతివాడూ శాపించేవాడే. మనం కొంచెం

న్యాయాన్యాయ మాలోచిస్తాం. అతడి స్థానంలో మన మున్నట్లనుకొని చూస్తే, కొంత దయాదాక్షిణ్యం వహించక తప్పదు.

ఇంతకూ మజిలీ అధికారం కేం ఏమిటి ? అట్టడుగున వున్న చిన్న వుద్యోగుల్లో ఇంత యమయాతనలకు గురి అయ్యేవా డింకొకడు లేడు. అధికార హోదా తప్ప ఇతణ్ని దెబ్బలనుంచి రక్షించేది మరొకటి లేదు. అదికూడ ఒకొకప్పుడు ఇతణ్ని రక్షించలేకపోతున్నది. (కాదని గుండె పైన చేయి వేసుకొని చెప్పమని పాఠకులను అడుగుతున్నాను.) ప్రిన్స్ వాజెమ్‌స్కీ వేళాకోళంగా పేర్కొంటున్న ఈ నిరంకుశాధికారి స్థాన మెంత కష్ట నిష్ఠూరంతో కూడుకొన్నది ? కఠినశిక్ష అనుభవించే ఖైదీకైనా యింత ప్రయాసవుందా ? రాత్రిం బగళ్లు పనే. క్షణంకూడ తీరిక నేదిలేదు. దీర్ఘ ప్రయాణంవల్ల కలిగే విసుగూ, చికాకు తెచ్చి ప్రయాణీకులు మజిలీ అధికారులపై గుమ్మరించి పోతారు. రోడ్లు అధ్వాన్నంగా వున్నాయి. వాతావరణం దుస్సహంగావుంది.

బండిమనిషి వట్టి పెంకె. గుర్రాలు తిండికి తిమ్మరాజులు, పనికి పోతరాజులు – ఇదంతా మజిలీ అధికారి తప్పే. అతడు తిట్లుతినక తప్పదు. అతని పూరికొంపలోనికి వచ్చే ప్రతి ప్రయాణీకుడూ అతణ్ణొక పగవానిగా చూస్తాడు. పిలువనిపేరంటంగా వచ్చిన యీ అతిథిని

త్వరగా సాగనంపగలిగితే మజిలీ అధికారి అదృష్టవంతుడే. కాని సమయానికి సరిగా గుర్రాలుండొద్దూ ? గుర్రాలు లేక కొంచెం ఆలస్యమయిందా ఇక బండబూతులూ, బెదిరింపులూ రాళ్ళవర్షంలా అతనిపైన కురిసినట్టే.

జోరుమని వర్షం వస్తుంటే, బురదలో అతను తడిసి ముద్దయి, ఇంటికిపరుగెత్తకతప్పదు. హోరుమని తుపాను వస్తుంటే జనవరినెల మంచులో బయట తలవాకిలి చూరుకింద వచ్చి నిల్చుంటాడు. ఇంటిలోపల అగ్గిలా మండుతూన్న ప్రయాణీకుని అరుపులూ, అదలింపులూ ఏదీ లేక ఉన్న సైనికోద్యోగైన ఒక జనరల్ వస్తాడు. మజిలీ అధికారి గడగడ వణకుతూ, మిగిలివున్న రెండు త్రోయకాలు అతని కిచ్చివేస్తాడు. ఇందులో ఒకటి తపాలబండికని తీసివుంచికూడదు. దీనికి కృతజ్ఞతగా ఒక్క మంచి మాటా పలుకైనా లేకుండా, జనరల్ వెళ్ళిపోతాడు. అయిదు నిముషాల తరువాత మువ్వలచప్పుడు వినపడుతుంది. ఒక ప్రభుత్వ వార్తాహరుడు కొత్త గుర్రాలిచ్చి పంపమనే ఆజ్ఞాపత్రం బల్లపై విసిరేస్తాడు. ఇవన్నీ ఆలోచించుకొంటే, మనకు ఆగ్రహానికిమారు అయ్యోపాప మనిపిస్తుంది. ఈ విషయమై రెండు మాటలు చెప్పి ముగిస్తాను.

గడచిన ఇరవై ఏండ్లలోనూ నేను రష్యా అంతటా ప్రయాణం చేశాను. మజిలీలుండే రాజమార్గాలన్నీ

నాకు తెలుసు. మజిలీ గుర్రబ్బంధ్లాతో లేవా ళ్లెందరో నాకు తెలుసు. నే నెరుగని మజిలీ అధికారంటూ లేదు. ప్రతివాడితో నాకేదో ఒకపనిపడింది. ప్రయాణాల్లో నాకు కలిగిన అనుభవాలను, నేను చూచిన విశేషాలను అనతి కాలంలో పుస్తక రూపంలో ప్రచురించాలని వున్నాను. మజిలీ అధికారాకులనుగూర్చి ప్రజల్లో లేనిపోని అపోహాలు కల్పించారని మాత్రం ప్రస్తుతానికి చెప్పదలచాను. అందరూ వ్వారికే తిట్టిపోసే ఈ మజిలీ అధికాకులు సాధారణంగా యోగ్యులు. అందరిలో మంచిగా వుండాలనే వాళ్ళు. కలియుగలుపు మనుష్యులు. తమ హక్కులను గూర్చి గోరంతలు కొండంతలు చేసే స్వభావంగాని, డబ్బు లాగుదామనే బుద్ధికానివాళ్ళకు లేదు. వారితో మాట్లాడితే మనకెన్నో వింతలూ, విశేషాలూ తెలుస్తాయి. ఇది గ్రహించకపోవడం ప్రయాణీకులు చేస్తున్న పెద్ద తప్పు. నామట్టుకు నాకు రాచకార్యాలపై ప్రయాణం చేస్తున్న ఉద్యోగి దద్దమ్మల ఉపన్యాసాలకన్న, ఈ మజిలీ అధికాకుల కబుర్లు వినడం నాకు సరదా.

ఈ మజిలీ అధికారివర్గంలో నాకు స్నేహితు లున్నారని పాఠకు లిదివరకే ఊహించివుంటారు. వాస్తవంలో వాళ్ళలో ఒకతణ్ని గూర్చి నే నెన్నటికీ మరువను—అతని స్మృతి అంత అమూల్యమయింది. పరిస్థితులు మమ్మల్నిద్దరినీ ఒక్కచోటికి తెచ్చాయి...

పాఠకు లవధరి స్తే అతని కథే నే నిప్పుడు చెప్పదలచు కొన్నాను.

1816 మేలో నేను 'అ' పరగణాలో ప్రయాణం చేస్తున్నా. ఆ ప్రయాణ మార్గమిప్పుడు లేదు. అప్పుడు నేనొక చిన్న అధికారిని. రెండు గుర్రాల బగ్గీలో ప్రయాణం చేసేవాణ్ణి. రెండు గుర్రాలకెక్కువ భరించే శక్తి నాకు లేదు. ఇందువల్ల మజిలీ అధికారులు నన్ను చులకనగా చూచేవాళ్ళు. అందువల్ల న్యాయరీత్యా నా కధికారముందనుకొన్న వాటిని దెబ్బలాడి తీసుకొనే వాణ్ణి. యువకుణ్ణి, అందులో ఆవేశ మెక్కువ. కాబట్టి నా కోసం సిద్ధంగా వుంచిన గుర్రాలను ఏ పెద్ద అధికారో వచ్చేసరికి అతనికిచ్చి సాగనంపే మజిలీ అధికారి పిరికి తనం, నీచ స్వభావం చూస్తే నాకు ఒళ్ళు మండేది. గవర్నరు విందుల్లో, తెలివిగల వడ్డించే వెధవలు నన్ను చూచీ చూడకుండా దాటవేసి పొయ్యేవాళ్ళు. వాళ్ళ ఈ అలక్ష్యానికి అలవాటు పడడానికి నాకు చాలాకాలం పట్టింది. అప్పుడు నా మనస్సుకు కష్టమనిపించినా, వాళ్లు చేసిన తప్పేమీ లేదని ఇప్పుడు తెలుస్తోంది. వాడి వాడి హోదానుబట్టి పెద్ద చిన్న నిర్ణయించాలనే సర్వ జన సమ్మతిమైన సూత్రానికి మారుగా వాడి వాడి బుద్ధినిబట్టి ఈ తారతమ్యాలు చూపాలనే సూత్రం ప్రవేశపెడితే మన గతేమవుతుంది? ఎన్ని రగడలు

రాద్ధాంతాలు బయలుదేరవు! ఇంట్లో నాకర్లు ఎవరికి ముందు వడ్డించాలి. సరే అది అలావుంచి, ప్రస్తుతానికి వస్తాము.

ఆ రోజు ఉక్కగా ఉంది. ఆ మజిలీ ఇంకా రెండు మైళ్లుందనగా, సన్నగా చినుకులు ప్రారంభమయి, నిమిషంలో కుండలతో గుమ్మరించినట్లు వర్షం వచ్చింది. తడిసి ముద్దయి పొయ్యాను. నేను మజిలీ చేరుకొన్న వెంటనే మొట్టమొదట చేసినపని బట్టలు మార్చుకోవడం. రెండవది టీ తీసుకొని రమ్మనడం. మజిలీ అధికారి "ఏయ్! దున్యా! శమొవార్ సిద్ధంచేసి వెళ్ళి యింత మీగడ తీసుకొని రా!" అని అరచాడు. అరగోడ అవతలనుండి పధ్నాలుగేళ్ళ అమ్మాయి గదిలోనికి వచ్చి గబగబ తలవాకిలి వద్దకు వెళ్ళింది. ఆ పిల్ల అందం చూచి నేను చకితుణ్ణయ్యాను.

"ఆ అమ్మాయి నీ కూతురా?" అని మజిలీ అధికారి నడిగాను.

"ఔను" అని అతను కొంచెం సగర్వంగా చెప్పాడు. "చాలా తెలివైన పిల్ల లెండి! చాలా చురుకైంది కూడాను! అంతా వాళ్ళమ్మ పోలికే" ఇలా అని అతను వెంటనే నా ఉత్తర్వు నకలు రాసుకోవడం ప్రారంభించాడు. నేను గది ఒకసారి కలయ చూచాను. పూరిపాకఅయినా చాలా శుభ్రంగాఉంది, గోడల

పైన తగిలించిన పటాలు చూస్తూ కూర్చొన్నాను. దుర్వ్యసనాలకు లోనై చెడిపోయిన కుమారునికథ తెల్పే పటాలవి. మొదటి చిత్రంలో రాత్రి టోపీ గౌనూ ధరించిన వృద్ధుడు ఒక యువకునికి వీడ్కోలిస్తున్నాడు. తండ్రి నుంచి ఆశీస్సులూ, డబ్బుసంచీ స్వీకరిస్తున్న యువకునిలో త్వరగా వెళ్ళిపోవాలనే ఆత్రుత కనపడుతోంది. ఇంకొక చిత్రంలో అతడు ఎలా దుర్వ్యసనాలకు లోనై చెడిపోతున్నాడో చూపించారు. కపటస్నేహితులు సిగ్గు విడిచిన స్త్రీలతో కలిసి విందారగిస్తున్నట్లు చిత్రించారు. తరువాత చిత్రంలో యౌవనమూ, డబ్బూ కోల్పోయి అతడు చింపిరిబట్టలతో పందులుకాస్తూ, వాటికి పెట్టే తిండి తింటూన్నట్లు చూపించారు. అతని ముఖంలో విషాదమూ, పశ్చాత్తాపమూ తాండవిస్తున్నాయి. కడపటి చిత్రంలో కొడుకు మళ్ళీ తండ్రిదగ్గరకు వచ్చిన దృశ్యముంది. వృద్ధుడదే టోపీ, గౌనూ తొడుక్కొని కుమారుని కెదురేగి కౌగిలించుకోవడానికి బయటికి వస్తున్నాడు. యువకుడు తండ్రి పాదాలపై పడుతున్నాడు. వెనుక దూరంగా వంటవాడు పండుగ వంటకై బలిసిన కోడెదూడను కోస్తున్నట్లు, ఇంటి పెద్ద కొడుకు ఏమిటీ హడావుడి అని నౌకర్లను అడుగుతున్నట్లు చిత్రించారు. ప్రతి చిత్రం క్రింద జర్మన్ భాషలో తదనుగుణమైన పద్యం వుంది. అవన్నీ చదివాను. ఈ

చిత్రాలూ, పూలమొక్కలున్న తొట్లూ, రంగుతెర వున్న పందిరిమంచం, గదిలోవున్న యితర సామానూ - ఇదంతా యిప్పటికీ నాకు కళ్ళకు కట్టినట్టుంది. ఆరోగ్యంతో, సంతోషంతో తొణికిసలాడే మొగంతో, పొడుగాటి పచ్చని కోటుతో, కోటుపైన రంగు మాసిన రిబ్బనులతో వేలాడుతోన్న మూడు పతాకాలతో, ఆ ఇంటి యజమాని నా ఎదుట వున్నట్టే వుంది నాకు. సుమారు యాభై ఏళ్ళ మనిషి అతను.

నేను బండి మనిషికి డబ్బిచ్చి పంపించివేశానో లేదో, మన్యా శమొవార్ తీసుకొని వచ్చింది. తన సౌందర్యం నన్నెంత ముగ్ధుణ్ణి చేసిందో ఆలే నెరజాణ గ్రహించినట్లుంది. నీలాలవంటి తన పెద్ద కళ్ళను కిందికి దించి ఆపిల్లతో బాతాఖానీ ప్రారంభించాను. ఏమాత్రం సిగ్గు, తొట్రుపాటు లేకుండా, లోకజ్ఞానమున్న దానిలా మాట్లాడుతోంది. ఒక గ్లాసులో కించ్ పోసి తాగమని పిల్ల తండ్రికందించాను. దున్యాకు ఒక కప్పు టీ ఇచ్చి, ముగ్గురం చిరకాలంగా పరిచయమున్నవారిలా మాటామంతీ ప్రారంభించాము.

ప్రయాణానికి గుర్రాలు సిద్ధంగావున్నాయి. కానీ మజిలీ అధికారిని, అతని కూతుర్ని విడిచిపోవడానికి మనస్సు రావడం లేదు. తుదకెట్లో వాళ్ళతో సెలవు తీసుకొని లేచాను. తండ్రి నన్ను సుఖంగా పోయిరమ్మని

వీడ్కోలిచ్చాడు. కూతురు నన్ను సాగనంపడానికి బండి వరకు వచ్చింది. నేను ముంగిట్లో ఆగి, ముద్దు పెట్టు కోందునా అని అడిగాను. దున్యా ఒప్పుకోంది......

"ఈ వినోదక్రీడ చవిచూడ మొదలిడిననాటినుండి" నేను వెనుదిరిగి చూచుకొంటే, ఎన్నో ముద్దులు నా స్మృతి పథంలో మెదలుతున్నాయి; కాని వాటిలో ఏది కూడ ఆనాడు దున్యా ఇచ్చిన ముద్దులా గుండెను చక్కలిగింత పెడుతూ నాలో శాశ్వతంగా నిల్చిపోలేదు.

చాల ఏళ్ళ తరువాత మళ్ళీ అదే మార్గంలో అదే గ్రామాలగుండా నేను ప్రయాణం చేయవలసి వచ్చింది. 'మజిలీ అధికారి కూతురు జ్ఞప్తికి వచ్చింది. మళ్ళీ ఆ అమ్మాయిని చూస్తానుగదా అని సంతో షించాను. నాకు మరుక్షణంలోనే, ఆ మజిలీ అధికారిని పనినుండి తొలగించారేమో? లేక దున్యాకు పెళ్ళయి మొగుడింటికి వెళ్ళిపోయిందేమో అనే ఆలోచనలు తట్టాయి. ఇద్దరిలో ఎవరో ఒకరు చనిపోయి వుండవచ్చు గదా అనే తలపు మెరపులో సోకిపోయింది. ఏదో దుర్వార్త వినబోతున్నాననే ఆందోళనతో మజిలీని సమీపించాను.

పోస్టుమాస్టరు ఇంటిముందు నా బగ్గీ నిల్చింది. ఇంట్లోకి వెళ్ళాను. దుర్వ్యసనాలతో డబ్బుతగలేసిన కొడుకు కథ చిత్రించే పటాలు వెంటనే గుర్తించాను.

కాని కిటికీలో పూలమొక్కలున్న తొట్లు లేవు. గదిలో వున్న ప్రతి వస్తువులోను, శైథిల్యం, ఉపేక్షాభావం మనల్ని కొట్టవచ్చినట్టు మజిలీ అధికారి గొంగ్రెతో లు కోటు కప్పుకొని నిద్రపోతున్నాడు. నా రాకవల్ల మెలకువ వచ్చి లేచి కూర్చున్నాడు. అతను మునుపు నేనుచూచిన సాంసన్ వైరినే. కాని ఎంత ముసలివా డయ్యాడని! నా ఉత్తర్వు నకలు రాసుకొంటున్నాడు. అతని సెంట్రుకలు నెరిసాయి. చెక్కిళ్లు గుంతలుపడి ముడుతలువడ్డాయి. భుజాలు కుంచించుకొని పోయాయి. మంచి దృఢకాయుడుగా వున్న మనిషికూడా నాలుగేండ్లలో శతవృద్ధులా అయిపోవడం చూచి నా కాశ్చర్యమయింది.

"నన్ను గుర్తించలేదు? మనం పాత స్నేహితులం" అని అన్నాను.

"ఉండవచ్చు. ఈ దారి చాలా రద్దీగా వుంటుంది. ఎంతోమంది ప్రయాణీకులు వస్తూ పోతూ వుంటారు" అన్నా డతను నిరాసక్తితో.

"మీ దున్యా ఎలా ఉంది? " అని అడిగాను.

ముసలివాడు ముఖం చిట్లించి "దేవునికే తెలుసు" అన్నాడు.

"అయితే ఆమెకు పెళ్ళయిందన్న మాట!" అన్నాను. అతను నా ప్రశ్న విననట్లు నటిస్తూ నా వుత్తర్వును పైకి చదువుతూ నకలు రాసుకోవడంలో

నిమగ్నుడయ్యాడు. నే నిక ప్రశ్నించడం మానివేసి శమొవార్ సిద్ధం చేయించుకున్నాను.

నా కుతూహలం పురి విప్పి నన్ను ఒత్తిడిచేస్తోంది. ఒక గ్లాసు మద్యం నా మిత్రుని నోటి తాళం తీయ కుండా పోతుందా అనే ఆశతో కూర్చొనివున్నా.

నేను పొరపడలా. మజిలీ అధికారి గ్లాసందు కొన్నాడు వద్దనకుండా. సారా నిషా అతని విచారాన్ని పటాపంచలు చేసింది. రెండో గ్లాసుతో నే నెవరైందీ జ్ఞప్తికి తెచ్చుకొని (లేక జ్ఞప్తికి వచ్చినట్లు నటిస్తూ) హుషారుగా మాట్లాడడం ప్రారంభించాడు. అప్పు డతని నోటినుంచి చిన్న కథ నా గుండెను నీరు చేసింది.

"అయితే మీకు మా దున్యా తెలుసన్నమాట?" అని మజిలీ అధికారి ప్రారంభించాడు. "మా దున్యాను ఎరుగనివా రెవరండీ! అయ్యో దున్యా! దున్యా! ఎలాంటి పిల్లయ్యా దున్యా అంటే. ఇక్కడికి వచ్చిన ప్రతివాడూ దాన్ని మెచ్చుకొనేవారండి. ఒక్కరూ దాన్ని పల్లెత్తు మాటఅన్న పాపానపోలేదు. ఆడవాళ్ళు దానికి చేతిగుడ్డో, కమ్మలో ఏదో ఒకటి బహుమానం ఇచ్చి పోతూవుండేవాళ్ళు. ఇక ఈ మజిలీకి వచ్చే పెద్ద మనుషులు భోజనానికనో, టీ కనో ఏదో కారణం పెట్టు కొని కొంతసేపు ఆగేవారు. నిజంగా వాళ్ళు ఎందు కాగే వారో తెలుసా? మా దున్యాను మరికొంతసేపు

చూడాలని ! వచ్చిన పెద్దమనిషి ఎంత కోపంతోనైనా వుండనీ. దున్యాను చూచిన తక్షణం నాతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడేవాడు. మీరు నమ్మరు కాని, ప్రభుత్వాధికారులు దున్యాతో మాటలకు పెట్టుకుంటే అర్ధగంటసేపు అల్లానే మాట్లాడుతూ కూర్చునేవారు. నా ఇల్లంతా దానిపైన ఆధారపడి వుండేది. ఇల్లు వూడ్చడం, వండటం, ఇదీ అదీ ఏమిటి ప్రతి పనీ అదే చేసేది. ఒక్కక్షణం అది కళ్ళకు కనిపించకపోతే, ఈ ముసలి ముండాకొడుక్కు దిక్కుతోచేదా ? దాన్ని చూస్తూ వుంటేచాలు నాకు కడుపు నిండినట్లుండేది. దానిపైన ప్రేమలేదా ? దాని కిక్కడ హాయిగావుండ లేదా ? దేవుడికి మొక్కితే రాత తప్పుతుందా ? జరుగ వలసింది జరిగి తీరుతుంది" అంటూ తనకు మూడిన ముప్పు ఇలా వివరించాడు.

మూడేళ్ళక్రితం చలికాలంలో ఒకరోజు సాయంత్రం మజిలీ అధికారి లెడ్జరులో రూళ్ళు వేసుకొంటూ కూర్చున్నాడు. అతని కూతురు అరగోడ వెనక కూర్చుని గౌను కుట్టుకొంటూవుంది. ఒక గుర్రబ్బండివచ్చి ఇంటిముందాగింది. ఉన్నిటోపీ, ఒక మిలిటరీ గ్రేట్-కోటూ, లావుపాటి మఫ్లర్ ధరించిన ప్రయాణీకుడొకడు గదిలోకివచ్చి గుర్రాలు సిద్ధంచేయించమని ఆజ్ఞాపించాడు. మజిలీలో ఒక్క గుర్రంకూడ లేకుండా అన్నీ వెళ్ళి

పోయ్యాయి. ఈ మాట విన్నాడో లేదో ప్రయాణీకుడు బొబ్బరిస్తూ కొరడా ఎత్తాడు. కాని ఇలాంటి దృశ్యాల కలవాటుపడిన దున్యా గదిలోకి పరుగెత్తు కొంటూ వచ్చి "తింటానికేమీ వద్దూ మీకు ?" అని లాలనగా మృధు మధుర స్వరంతో అతణ్ణి పలుకరించింది. అలాంటి సమయాల్లో దున్యా ప్రత్యక్షమయితే ఏం జరిగేదో అదే జరిగింది. ఆగంతకుని కోపం పూర్తిగా చల్లారింది. గుర్రాలకోసం కాచుకుని కూర్చోవడాని కంగీకరించి వంట కానిమ్మన్నాడు, తడిచినటోపీ, మెడకు చుట్టుకొన్న మఫ్లర్, గ్రేట్-కోటూ తీసివేశాడు. చూస్తే, అతనొక నూనూగు మీసాల బక్కపలుచని యువకుడు. హుస్సార్ దళంలోని ఆఫీసరు. కొన్ని నిమిషాల్లోనే, మజిలీ అధికారి ఇంటివాడిలా, అతను దున్యాతోనూ, దున్యా తండ్రితోనూ కులాసాగా కబుర్లు చెప్పుకొంటూ కూర్చున్నాడు. భోజనా లయ్యాయి. ఇంతలో గుర్రాలూ తిరిగి వచ్చాయి. వాటికి గడ్డిగాదం వేయకుండానే వచ్చిన వాటిని వచ్చినట్టే ప్రయాణీకుణ్ణి బండికి కట్టమని ఆజ్ఞాపించి ప్రయాణానికంతా సిద్ధం చేశాడు. కాని అతను లోపలికి వచ్చి చూచేసరికి యువకుడు బల్లపైన స్పృహ తప్పి పడుకొని వున్నాడు. అతనికి తల తిరుగుతోందట. లేస్తే కిందపడి పోతాడట. ఇక ప్రయాణ మెలా చేస్తాడు. గత్యంతరం

లేదు. మజిలీ అధికారి తన మంచం అతనికిచ్చాడు. రేపటికూడ అతనికి తెరపి చిక్కకపోతే, డాక్టరుకోసం 'సి' గ్రామానికి చెప్పి పంపాలని నిర్ణయించారు.

మరుసటిరోజు ఆ మిలిటరీ ఆఫీసరు స్థితి మరింత అధ్వాన్నమయింది. అతని నౌకరును వైద్యునికోసం పక్క పట్టణానికి పంపించారు. దున్యా చేతిగుడ్డను ఏదో మందులో తడిపి అతని తలకు పట్టేసి, కుట్టుపని ముందర వేసుకొని అతని ప్రక్కనే కూర్చొంది. మజిలీ అధికారి ఎదుటవుంటే రోగి ఒకటే మూల్గడం. ఒక్కమాటగూడ మాట్లాడే స్థితిలో లేడు. (కాని ఎలాగో రెండు కప్పుల కాఫీ తాగి భోజనం సిద్ధంచేయమని మూల్గాడనుకోండి!) దున్యా అతని మంచం విడిచిపోవడం లేదు. ఎప్పుడూ దప్పి దప్పి అని మూల్గేవాడు. అలా అన్నప్పుడల్లా దున్యా తను తయారుచేసిన లెమొనేడు గిన్నెలోపోసి అతని నోటి కందించేది. రోగి దాంతో పెదవులు తడుపుకొని గిన్నె మళ్ళీ దున్యా కందించేటప్పుడు ఆమె చేతులు తన అరచేతిలో తీసుకొని ఒత్తేవాడు. కృతజ్ఞతా సూచకంగా భోజనం వేళకు వైద్యుడు వచ్చాడు, నాడి చూచి యువకునితో జర్మన్ భాషలో ఏదో మాట్లాడి తరువాత రష్యన్ భాషలో రోగికి సంపూర్ణమైన విశ్రాంతి అవసరమనీ, రెండు రోజుల్లో ఆతను ప్రయాణం చేయడానికి అభ్యంతరముండదనీ అన్నాడు. రోగి వైద్యునికి

25 రూబుళ్ళు ఫీజు ఇచ్చేసి భోజనానికి నిల్చాడు. తరువాత యిద్దరూ తృప్తిగాతిని, ఒక సీసా ఖాళీచేసి, ఒకరితో నొకరు కులాసాగా కబుర్లు చెప్పుకొంటూ కూర్చున్నారు.

మరుసటిరోజుకే యువకుడు పూర్తిగా తేరుకున్నాడు. అతను నవ్వుతూ, తేలుతూ తనతోనూ, దున్యాతోనూ పరియాచకాలాడుతూ వచ్చేపొయ్యే ప్రయాణీకులతో కబుర్లు చెప్పుకొంటూ, లెక్కలపుస్తకంలో అంచెలు నమోదుచేస్తూ వుండడం చూచి, మజిలీ అధికారికి అతనిపై మక్కువ కలిగింది. మూడవరోజు ఉదయం అతను బయలుదేరే సమయం వచ్చేసరికి మజిలీ అధికారి కతనితో సెలవు తీసుకోవడమే కష్టమని పించింది. ఆరోజు ఆదివారం. దున్యా చర్చికి పోవడానికి సిద్ధమయింది. యువకునిబండి వచ్చి బయట నిలబడింది. మూడురోజులు భోజనం పెట్టినందుకుగ్గాను ప్రయాణీకుడు మజిలీ అధికారికి ఉదారంగా డబ్బిచ్చి, దున్యాతో కూడ వెళ్ళివస్తానని చెప్పి, తన బండిలోవస్తే ఊరవతలవున్న చర్చివద్ద దిగబెడతా నన్నాడు. ఏమి చెప్పాలో దిక్కు తోచని దానిలా దున్యా నిలబడివుంటే తండ్రి అన్నాడు.

"సంభయం, నాకు దొరగారు తోడేలా ఏమి? నిన్ను కరవడులే. నిన్ను చర్చివద్ద దిగబెట్టనివ్వు". దున్యా బండెక్కి యువకుని పక్కన కూర్చొన్నది. నొకరూ

బండెక్కాడు. బండివాడు ఈలవేయడంతో గుర్రాలు దౌడుతీశాయి.

తన కూతుర్ని ఆ మిలిటరీ ఆఫీసరు వెంటపోడానికి తానెలా అనుమతించాడో, తన కళ్ళకేమి కప్పు కొందో, తన్నే దయ్యం పట్టుకొందో పాపమా నిర్భాగ్యునికి నేటికీ అర్ధంకాలేదు... అర్ధగంటయిన తరువాత గుండెలో గుబులు గుబులుగా వుంది. ఏదో గుండె నములుతూ వున్నట్లుగావుంది. మనసు పరిపరివిధాల పోజొచ్చింది. ఆందోళన ఆపుకోలేక కూతురుకోసం చర్చికి బయలుదేరాడు. చర్చి దగ్గరకు వెళ్ళగానే జనం ప్రార్ధన ముగించుకొని బయటికి వస్తున్నారు. దున్యా చర్చి ముంగిటకాని, పెరటిలోకాని కనిపించలేదు. చర్చి లోపలికివెళ్ళి చూచాడు. మతగురువు వేదికవద్దలేడు. సెక్స్టన్ దీపా లార్పుతున్నాడు. ఒకమూల ఇద్దరు ముసలవ్వలు మోకరిల్లి ప్రార్ధన చేస్తూవున్నారు. దున్యా మాత్రం లేదు. వ్యధతో కుంగిపోతున్న తండ్రి మా దున్యా ప్రార్థనకు వచ్చి వుండిందా అని సెక్స్టన్‌ను అడుగలేక, అడుగలేక అడిగాడు. లేదని అతను జవాబివ్వటంతో మజిలీ అధికారి పై ప్రాణాలు పైనే పోయాయి. ఎలాగో ఇంటికివచ్చి పడ్డాడు. ఇప్పుడిక అతనికొకే ఆశవుంది. దున్యా చిన్నతనంవల్ల, తన అమ్మమ్మ వుండే పక్క మజిలీకేమైనా పోయిందో ఏమో!

తను పంపించిన గుర్రాలకోసం క్షణమొక యుగంగా ఎదురు తెన్నులు చూస్తూకూర్చున్నాడు. పగలంతా గడచిపోయింది. తుదకురాత్రికి బండివాడొకడే వచ్చాడు. దున్యా మిలిటరీ ఆఫీసరుతో పక్క మజిలీ దాటి పోయిందనే పిడుగువంటి వార్త చెవిలో వేశాడు.

ఆ తరువాత ఆ ముసలివాడు మళ్ళీ మొదటి మనిషి కాలేదు. ఆ రాత్రే మంచమెక్కాడు - అంతకు ముందు రాత్రే ఆ దగాకోరు పండుకొన్న మంచం - గడచిన సంగతులను ఒకటొకటే జ్ఞప్తికి తెచ్చుకొంటే, యిప్పుడన్నీ అర్థమయ్యాయి. ఆ కుర్రకుంకకు జబ్బూ లేదు, గిబ్బూ లేదు; వట్టి నటన అని తెలిసిపోయింది. ముసలివాడికి తెలివి లేకుండా జ్వరం వచ్చింది. జ్వరంతో వున్న అతణ్ణి పక్క పట్టణానికి తీసుకొనివెళ్ళి, తాత్కాలికంగా మరొకరిని మజిలీ అధికారిగా నియమించారు పైవాళ్ళు. పట్నంలో అతనికి మందిచ్చింది మిలిటరీ అధికారిని రక్షించిన డాక్టరే. ఆ వైద్యుడు, తను పరీక్ష చేసిన యువకుడు మేకులా ఉండినాడనీ, వాడి దురాలోచన తన కానాడే అర్థమయిందనీ, అందుకు వాడెక్కడ తన్ను తంతాడో అనే భయంతో అలా చెప్పాననీ మజిలీ అధికారితో అన్నాడు. మరి ఆ జర్మనీవాడు నిజమే చెప్పాడో, తన తెలివితేటలు చూపడాని కిలా అన్నాడో దేవునికి తెలుసు. ముసలివాడికి మాత్రం

ఆ మాటలవల్ల దుఃఖోపశమనం కాలేదు. జ్వరం తగ్గి, లేచి తిరిగేస్థితికి వచ్చిన వెంటనే మజిలీ అధికారి పట్నంలోవున్న పై అధికారితో రెండు నెలలు సెలవు తీసుకొని, ఎక్కడికి పోతున్నది యెవరికీ చెప్పకుండా కూతుర్ని వెదకడంకోసం కాలినడకన బయలుదేరాడు. లెఫ్టినెంటు కాప్టన్ మిన్‌స్కీ స్మాలెన్‌స్కనుండి పీటర్స్ బర్గ్‌కు ప్రయాణం చేశాడనే విషయం అతనికి తెలుసు. 'దున్యా, తాను ఒప్పే అతని వెంట పోతున్నప్పటికీ, దారి పొడువునా ఏడుస్తూవుండిందని బండివాడు చెప్పాడు. "దేవుని దయవుంటే తప్పుదారినబడ్డ నా కూతుర్ని మళ్ళీ తెచ్చుకోలేనా ?" అని అనుకొన్నాడు. ఈ ఆలోచనవల్ల ఒంటికి కొత్తబలం వచ్చినట్లయి పీటర్స్‌బర్గ్ నగరం చేరుకొన్నాడు. తను మిలిటరీలో వున్నప్పుడు తనతోపాటు సర్వీసులోవుండి ప్రస్తుతం పింఛను తీసుకొన్న ఒక నాన్ కమిషన్డ్ ఆఫీసరొకడు పీటర్స్‌బర్గ్‌లో ఇజ్‌మెయిలొవ్ బారకాసుల్లో వున్నాడు. మజిలీ అధికారి ఆ పాత స్నేహితు నింటో దిగాడు. కాప్టన్ మిన్‌స్కీ పీటర్స్‌బర్గు లోనే వున్నాడనీ, డెముటోవ్ హోటల్లో అతను మకాం పెట్టాడనీ ముసలివాడు కనుక్కొన్నాడు. ఎట్లైయినా అతణ్ని చూడాలని నిశ్చయించుకున్నాడు.

మరుసటిరోజు తెల్లవారుజామునే లేచి, కాప్టన్ మిన్‌స్కీ ఇంటికి వెళ్ళి బయటవున్న నౌకరుతో "ఒక

ముసలి సైనికుడు మిమ్మల్ని చూడటానికి వచ్చాడని మీ కెప్టెన్‌గారితో వెళ్ళి చెప్పమన్నాడు." నౌకరు యజమాని బూట్లు పాలిష్‌చేస్తూ కెప్టెన్‌గారు నిద్ర పోతున్నారనీ, 11 గంటలలోపల ఎవరినీ చూడరనీ అన్నాడు. మజిలీ అధికారి వెళ్ళిపోయి 11 గంటలకు సరిగ్గా మళ్ళీ వచ్చాడు. డ్రెస్సింగ్ గౌను, ఎర్రని వున్ని టోపీతో మిన్‌స్కీనే స్వయంగా బయటకువచ్చి "ఏం కావాలి ముసలయ్యా?" అన్నాడు. మజిలీ అధికారి దుఃఖం పొంగి పొరలింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. గద్గద స్వరంతో "బాబూ! బాబూ!! మీ పుణ్యా ముంటుంది బాబూ!" అని మాత్రమే అనగలిగాడు. మిన్‌స్కీ అతణ్ని క్షణంసేపు పరీక్షగాచూచి ముసలి వాడిని గుర్తించాడు. అతని మొగం జేవురించింది. మజిలీ అధికారి చేయి పట్టుకొని తన గదిలోనికి తీసుకెళ్ళి లోపల తలుపుకు గొళ్ళెం పెట్టాడు. మజిలీ అధికారి ఇలా అన్నాడు: "బాబూ! పోయిందేమో పోయింది. కనీసం నిర్భాగ్యురాలైనా నా పిల్లనైనా నా కిప్పించండి బాబూ! దానితో మీ రనుభవించే సుఖం అనుభ వించారు. అన్యాయంగా దాని బతుకు పాడుచేయొద్దండి. మీ పాదాలకు మొక్కుతాను."

"జరిగిపోయిందాన్ని మళ్ళీ వెనక్కు తిప్పలేం!" అన్నాడు ఆ యువకుడు జాలిగా. "నీకు నేను అన్యాయం

చేశాను. నీ క్షమాపణ అడుక్కోవడానికి సిద్ధంగా వున్నాను. కాని దున్యాను చేయివిడిచేంతటి దుర్మార్గానికి ఒడిగడతానని నీ వనుకోవద్దు. ఆమె సుఖంగా వుంటుంది ... నీ సాక్షిగా చెప్పుతున్నాను... ఆమెతో నీ కేమి పని? ఆమె నన్ను ప్రేమిస్తోంది. మళ్ళీ మును పటి జీవితానికి అలవాటు పడ లేదుకూడ. మీా ఇద్దరూ జరిగినదాన్ని మరచిపోవడం సాధ్యమా?" కాప్టన్ ఇలా అని మజిలీ అధికారి కోటుజేబులో ఏదో పెట్టి తలుపు తీశాడు. ఆ వృద్ధుడు తెప్పరిల్లుకొని ఏమి జరిగిందో తెలుసుకొనే లోపలనే, అతను వీధిలో నిల్చున్నాడు.

అతనలా చాలాసేపు వీధిలో స్తబ్ధుడై నిలబడ్డాడు. ఓ- అంతసేపటికి తన కోటుజేబులో ఏదో ఉన్నట్టని పించింది. జేబులో చేయిపెట్టి చూస్తే అవి నలిగిన 5, 10 రూబుళ్ళనోట్లు. మళ్ళీ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. గుండెను క్రోధానలం దహిస్తే వచ్చే కన్నీళ్ళు. నోట్లు తీసి, పిడికిలితో పిసికి పిడుచచేసి క్రింద విసరి బూటుతో తొక్కి వెళ్ళిపొయ్యాడు ... కొన్ని అడుగులు వెళ్ళాక నిలబడి, ఏమాలోచించాడో వెనక్కు వచ్చాడు. కాని నోట్లకట్ట అక్కడలేదు. మంచి దుస్తులు వేసుకొన్న ఒక యువకుడు అతణ్ణిచూచి దగ్గరున్న ఒక గుర్రబ్బండి వద్దకు పరుగెత్తి హడావుడిగా "పోనీయ్!" అని అరచాడు. మజిలీ అధికారి అతణ్ణి వెంబడించడానికి ప్రయత్నించ

లేదు. తన వూరికి వెళ్ళి మళ్ళీ పనిలోకి చేరాలని నిశ్చయించుకొన్నాడు. కాని వెళ్ళిపొయ్యేముందు ఒక్కసారైనా కూతుర్ని చూచిపోదామని అనిపించిందనికి. అందుకై, రెండురోజుల తరువాత మళ్ళీ మిన్‌స్కీ ఇంటికి వెళ్ళాడు. కాని నౌకరు అతణ్ణి చూచీచూడకనే "బాబుగారు ఎవర్నీ చూడరు పొమ్మని కటువుగ చెప్పి, హాల్లో నుంచి అతణ్ణి వీధిలోకి గెంటివేసి దభాలున తలుపువేసుకొన్నాడు. మజిలీ అధికారి వీధిలో కొద్దిసేపు నిల్చొని వెళ్ళిపోయాడు.

ఆరోజు సాయంత్రం మృతవీరుల చర్చిలో ప్రార్థన చేసి లిటీనియా వీధిలో నడుస్తున్నాడు మజిలీ అధికారి. ఒక చక్కని గుర్రబ్బండి శరవేగంతో అతని పక్కనే దూసుకొని పోయింది. బండిలో కాప్టెన్ మిన్‌స్కీ కూర్చొని వున్నాడు. బండి అల్లంత దూరంలో వున్న ఒక మూడంతస్థుల మేడ సింహద్వారం ముందు ఆగింది. మిన్‌స్కీ బండినుండి కిందికి దూకి లోపలికి వెళ్ళిపోయాడు. ముసలివాడికొక చక్కటి ఆలోచన తట్టింది. వెనుదిరిగి బండి దగ్గరకు వెళ్ళి బండివాడితో అన్నాడు.

"ఈ గుర్రం ఎవరిది తమ్ముడూ? మిన్‌స్కీది కదూ?"

"ఔను ఆయందే. ఎందు కడుగుతున్నావు?"

"ఎందుకా? మీ దొరగారు ఒక చీటీ రాసి దున్యాకిచ్చి రమ్మన్నారు నన్ను. ఈ దున్యా వుండే ఆమె ఎక్కడుందో నేను మరచిపోయ్యాను నాయనా!"

"అరె! ఆమె వుండే దిక్కడే, ఆ మేడపైన. కాని నీవు చీటీ ఇవ్వడం ఆలస్యం చేశావు తాతా! కాప్టెన్‌గారు ఇప్పుడే ఆమెను చూడడానికి వచ్చారు."

"ఫరవాలేదులే" అన్నాడు. మజిలీ అధికారి గుండె గగుర్పొడుస్తూవుంటే. "ఆమె ఇల్లు చూపినందుకు కృతజ్ఞుణ్ణి. చీటీ ఇస్తానని చెప్పినమాట నిలబెట్టుకోవాలి మరి" అని అంటూ మెట్లెక్కి మేడపైకి వెళ్ళాడు.

తలుపు లోపల తాళం వేసివుంది. బెల్లు కొట్టాడు, కొన్ని క్షణాలు గడిచాయి. క్షణమొక యుగంలా తోచింది ముసలివాడికి. లోపల తాళంచెవి పెట్టి తిప్పిన శబ్దం వినవచ్చింది. తరువాత మెల్లగా తలుపు తెరచుకొంది. "అవదోత్యాసావ్ సానొవ్నా వుండే దిక్కడేనా?" అని అడిగాడు.

"ఔను, ఆమెతో ఏం పని?" అని తలుపు తీసిన పిల్ల అడిగింది. కాని మజిలీ అధికారి జవాబు చెప్పకుండా హాల్లో ప్రవేశించాడు.

"అలా లోపలికి వెళ్ళడానికి సెలవులేదు" అని పనిమనిషి అరచింది. కాని ముసలవాడు వినిపించుకోలేదు. ముందుకు నడచాడు. మొదటి రెండు గదులూ చీకటిగా

వున్నాయి. మూడవ గదిలో వెల్తురు కనపడుతోంది. తలుపుతీసివుంది. తలుపు వద్దకు వెళ్ళి హఠాత్తుగా ఆగాడు. గదిఅద్భుతంగా అలంకరింపబడివుంది. మిన్‌స్కీ కూర్చొని ఏదో ఆలోచనల్లో మునిగివున్నాడు. దున్యా ముచ్చటగా ముస్తాబై అతని కుర్చీ చేతిపై పెడగాళ్ళు వేసుకొని కూర్చొని, ప్రియుని నల్లని ఉంగరాల జుట్టును తన వేళ్ళకు చుట్టుకొంటూ అతని ముఖంలోకి ఆప్యాయంగా కన్నార్పకుండా చూస్తోంది. ఆమె వేళ్ళనిండా రాళ్ళ ఉంగరాలున్నాయి. దున్యా ఇంత అందంగా ఎప్పుడూ కనిపించ లేదా తండ్రికి పాపం ! అతను సంభ్రమాశ్చర్య లతో కళ్ళుప్పగించి చూస్తూ నిలబడ్డాడు.

. "ఎవరది" అని కేక వేసింది దున్యా తల పైకెత్త కుండా. మజిలీ అధికారి మాటాడలా. సమాధానం రానందువల్ల, దున్యా పైకి చూచింది......కెవ్వుమని అరచి కుప్పగా కూలింది రత్నకంబళిపైన. మిన్‌స్కీకి భయమయింది. వంగి ఆమెను లేవనెత్తబోయి వాకిట్లో నిల్చొన్న ముసలివాణ్ణి చూచాడు. దున్యాను అలానే వదిలేసి మిన్‌స్కీ వాకిట్లోకి వచ్చాడు; కోపంతో అతని శరీరం ఆపాదమస్తకం కంపిస్తోంది.

"ఏం కావాలి నీకు ?" అని పళ్లు కొరుకుతూ అన్నాడు. "దొంగలా నన్నెందుకు వెంబడిస్తున్నావు ? నన్ను చంపాలని చూస్తున్నావా ? పో, ఇక్కడినుంచి

పో!" అని ముసలివాడి కోటుకాలర్ పట్టుకొని తన బలమైన చేత్తో మెట్లవద్దకు తోశాడు.

వృద్ధుడు తాను దిగిన ఇంటికి వెళ్ళిపోయాడు. పోలీసులకు ఫిర్యాదు చేయమని అతని స్నేహితుడు సలహా ఇచ్చాడు. కాని మజిలీ అధికారి కొంతసేపు ఆలోచించి వద్దని నిర్ణయించుకొన్నాడు. తరువాత రెండు రోజులకు పీటర్స్‌బర్గ్ వదలి మళ్ళీ వచ్చి తన పనిలో చేరాడు. "దున్యా లేకుండా, నేను ఒంటిగా వుండబట్టి మూడేండ్లయింది" అని కథను ముగించాడు ముసలివాడు. "అది భూమిపై ఉందో లేదో, దేవునికి తెలుసు. ఏమైనా జరిగి వుండవచ్చు. నా కూతురిలా దారినబోయ్యే పోకిరి వెధవ వలలోపడి వాడి వుంపుడు కత్తెగావుండి, తరువాత గాలికి వదలివేయబడ్డ అమాయక స్త్రీ లెందరో గతంలో పాడయ్యారు. ఇకముందుకూడ పాడవుతారు. దున్యావంటి తెలివిమాలిన పిల్లలెంత మందో పీటర్స్‌బర్గులో మఖమల్ బట్టల్లో కులుకుతున్నారు. రేపు వాళ్ళే అలగాజనంతో కలసి వీధులూడుస్తారు! చూడండి నా మాట. దున్యా ఆ నగరంలో అలా హీనంగా బతుకుతూ వుందేమో అనే ఆలోచన వచ్చినప్పుడు దేవుని దయతో అది భూమిమీద లేకుండా వుంటే బాగుండునని అనిపిస్తుంది వాస్తవంగా..."

మజిలీ అధికారి ఈ విషాదగాథ చెప్పుతున్నంత సేపూ కళ్ళనీళ్ళు కారుస్తూ, తన కోటు అంచుతో కళ్ళు తుడుచుకొంటున్నాడు. డిమిట్రీవ్ గేయకథలోని పెరెంటెయిచ్ లాగా[12] ...తన గోడు చెప్పడంలో అతడు తాగిన 5 గ్లాసుల సారాయికూడ ఈకన్నీళ్ళకు సగం కారణ మని చెప్పాలి. ఐనా అతని కథ విని నా గుండె చెరు వయింది. నే నతనితో సెలవు తీసుకొని వెళ్ళిపోయిన చాలా రోజులవరకు ఈ ముసలివాణ్ణీ, నిర్భాగ్యురాలయిన అతని కూతుర్నీ నా మనఃఫలకమునుంచి తుడిచివేయ లేకపోయ్యాను.

కొద్దిరోజులక్రితం నేను మళ్ళీ 'ఆ' గ్రామంగుండా ప్రయాణం చేస్తూన్నాను. అకస్మాత్తుగా నాకు పాత స్నేహితుడు జ్ఞప్తికి వచ్చాడు. అతడొకప్పుడు నిర్వ హించిన మజిలీ ప్రస్తుత మక్కడ లేదని తెలిసింది. "ఆ మజిలీ అధికారి ఇంకా జీవించి వున్నాడా ?" అనే ప్రశ్న కెవ్వరూ ఇదమిత్థంగా సమాధాన మివ్వలేకపోయారు. నాకు పరిచితమైన ఆ ప్రాంతానికి ఒకసారి వెళ్ళిరావా లని బుద్ధిపుట్టింది. వెంటనే గుర్రాలు అద్దెకు తీసుకొని బండెక్కి 'న' గ్రామం వెళ్ళాను.

అది ఆకురాలు కాలం. ఆకాశం మేఘాచ్ఛాది తమై ఉంది. పొలాలనుండి చలిగాలి వీస్తోంది. ఎర్రని, పసుపుపచ్చని, పండుటాకులు గాలిలో ఎగురుతున్నాయి.

పొద్దుకుంకే వేళకు పల్లె చేరి మజిలీ అధికారి ఇంటిముందు ఆగాను.

లోపలినుండి బూరుగదిండులాంటి ఒక స్త్రీ తల వాకిట్లోకి వచ్చింది (మన్యాను నే నిక్కడనే ముద్దు పెట్టుకొన్నది) నా ప్రశ్నలకు సమాధానంగా, సంవత్సరం క్రిందట మజిలీ అధికారి చనిపోయాడని ఆమె చెప్పింది. ఆ ఇల్లు ఒక సారాబట్టీ యజమాని కొన్నాడట. నాతో మాట్లాడుతున్న దతని పెళ్ళామే. ఏడు రూబుల్లు ఖర్చు చేసి ఇంతదూరం రావడం వృథా అని నేను విచారించాను.

"ఆతని కేమైన చనిపొయ్యాడు?" అని అడిగాను.

"తాగడం జాస్తి అయి చనిపొయ్యాడండి" అన్న దామె.

"అతణ్ణి ఎక్కడ పూడ్చారు."

"ఊరవతల అతని పెళ్ళాం పక్కనే."

"అతని సమాధి దగ్గరికి నన్నెవరైనా తీసుకెళ్ళుతారా?"

"ఓ! తప్పకుండా. ఏయ్! వాంకా! ఆ పాడు పిల్లిని వదలి ఇలారా! వీరిని స్మశానం దగ్గరకు తీసుకెళ్ళి మజిలీ అధికారి సమాధి చూపించిరా."

ఒక చిన్న పిల్లవాడు నా వెంట వచ్చాడు: బట్టలు చిరిగాయి. రాగిచెంబులా నెత్తి; ఒక కన్ను

లొట్టపోయింది. నన్ను ఊరి చివరకు తీసుకెళ్ళాడా కుర్రవాడు.

దోవలో వాణ్ణి అడిగాను. "మజిలీ అధికారి నీకు తెలుసా ?"

"తెలీకేమి? నా కాయన పీపీలు చేసేది నేర్పించాడుగా! చచ్చి ఏ స్వర్గానున్నాడో కాని. సారా అంగడిదాటి బయటికి వచ్చేసరికి నే మాయన వెంట పడేవాళ్ళం, మామయ్యా, మామయ్యా మాకు తినేందు కేమైన ఈయవూ? అని — అతను మా కందరికి పప్పులు పంచిపెట్టేవాడు. మమ్మల్ని ఎప్పుడూ ఆడించేవాడు."

"ప్రయాణీకు లెవరూ అతణ్ణిగురించి అడగరూ?"

"ఇప్పుడు ప్రయాణీకులీదోవను రారు. మేజస్ట్రేటు గారొకరూ వస్తుంటారు. కాని ఆయనకు చచ్చినవాళ్ళతో పనేముంది ? కాని గడచిన వేసవిలో ఒక పెద్ద దొరసాని గారు వచ్చారు. ఆమె మజిలీ అధికారి విషయమడిగి తెలుసుకొని అతని సమాధి చూచివచ్చింది.

"ఆమె ఎలా వుంది ?" అని అడిగా ఉత్కంఠతో.

"చాలా అందంగావుంది" అన్నాడా కుర్రాడు. "ఆరు గుర్రాలు కట్టిన చక్కని బగ్గీలో వచ్చింది. ముగ్గురు పిల్లలూ, ఒక దాది, ఒక నల్లకుక్క, తానూ. ముసలి పోస్టుమాస్టరు చనిపోయాడని నేను చెప్పగానే ఆమె

బోరుమని ఏడ్చి, పిల్లలతో ఇలా అంది: 'మీరిక్కడ్నే వుండండి. నేను స్మశానం దగ్గరకు వెళ్ళివస్తాను.' ఆమెను తీసుకెళ్ళతానని నే నన్నానుకాని, ఆమె 'నాకు దారి తెలుసు' అని నా చేతిలో 5 కోపెక్కుల వెండిరూక పెట్టింది – చాలా మంచి దొరసాని."

మేము సమాధుల దగ్గరకు వచ్చాం. ఒట్టి బయలు, చుట్టూ కంచెకూడా లేదు. ఇక్కడకూడా కర్రతో జేసిన శిలువలు మాత్ర మున్నాయి. వాటికి ఎండనుంచి రక్షణ కూడా లేదు. నా జీవితంలో అలాంటి పాడు స్మశానం చూడ లేదు.

"మజిలీ అధికారి సమాధి యిదేనండి" అని ఆ కుర్రాడన్నాడు, ఒక చిన్న యిసుకదిబ్బపై గంతేస్తూ. ఇత్తడి ఐకన్‌గల నల్లటి శిలువ ఒకటి ఇసుకలో నాటారు.

"ఆమె యిక్కడకు వచ్చిందా!" అని అడిగాను నేను.

"వచ్చింది" అన్నాడు వాడు.

"దూరంగా నిలబడి నేను చూస్తూవున్నాను. ఆమె సమాధిపై సాగిలపడి చాలాసేపువరకూ అట్లే వుంది. తరువాత వూరిలోకి వచ్చి మతగురువును పిలిపించి కొంత డబ్బిచ్చింది. నాకు అయిదు కోపెక్కుల వెండిరూక ఇచ్చిందండి. చాలా మంచామె."

నేనూ వాడి చేతిల్లో అయిదు రూకల కోపెక్కు పెట్టాను.

ఇంతదూరం వచ్చినందుకు గాని, 7 రూబుళ్ళు ఖర్చయినందుకు గాని నేను విచారించలేదు.

# పేదపిల్లగా
# మారిన
# పెద్దింటి అమ్మాయి



*ఏమి ధరించితేనేమి, హృదయేశ్వరి!*
*నీ మధురమూర్తి నను ముగ్ధుణ్ణిచేసె.*

*బొగ్దానోవిచ్* (13)

ఇవాన్ పెట్రోవిచ్ ఎస్టేటు ఒక మారుమూల రాష్ట్రంలో ఉంది. పైలాపచ్చీసులో వున్నప్పు డతను గార్డుదళంలో వుండి 1797 లో ఉద్యోగం విరమించుకొని స్వగ్రామం చేరాడు. ఆ తరువాత అతను, ఎస్టేటు వదలిన వాడుకాడు. ఒక పేదవాళ్ళమ్మాయిని పెళ్ళాడాడు కాని, భర్త ఎక్కడో దూరంగా వేటకు వెళ్ళినప్పుడు ప్రసవించి చనిపోయింది. బెరోస్టోవ్ తన భూమీ పుట్రా చూచుకోవడంలో మనస్సు లగ్నంచేసి భార్య వియోగం కొంత మరచాడు. సొంతంగా ప్లానువేసి ఒక పెద్ద ఇల్లు కట్టాడు. ఎస్టేటులో ఒక జౌళి మిల్లు స్థాపించి సంపాదన

అభివృద్ధి చేసుకొన్నాడు. జిల్లాలో చుట్టుపట్ల తనంతటి తెలివిపరులు లేరని అతని నమ్మకం. తన పిల్లాజెల్లా కాక, వేటకుక్కలతో సహా అతనింట్లో ఠికాణా వేసే ఇరుగు పొరుగు భూస్వాములు అతని నమ్మకం సడలించ కుండా బహు జాగ్రత్తపడ్డారు. మామూలురోజుల్లో ఇల్లు వదలి బయటికివస్తే ముఖమల్ పొట్టి కోటు ధరించే వాడు. సెలవురోజుల్లో ముతక చేనేత బట్టతో తయారు చేసిన ఫ్రాక్ కోటు వేసుకొనేవాడు. జమా ఖర్చుల లెక్కలన్నీ తనే రాసేవాడు. సేనేటు సభ్యులు గొప్ప ఇతనం కన్నెత్తి చూచేవాడుకాడు. కొంత గర్విష్ఠి అనే వాడుక వున్నా, మొత్తంపైన అతనంటే అందరికీ సదాభి ప్రాయమే ఉంది. అతని ఎస్టేటుకు పక్కన్నే గ్రిగోరీ ఇవానొవిచ్ మురోమ్‌స్కీ ఒక్కడికే అతనంటే సరిపోదు. గ్రిగోరీ ఇవానొవిచ్ పాతకాలపు మనిషి. ఆస్తిపాస్తుల్లో అధికభాగం మాస్కోలో ధ్వంసపారాయణమైపోయి నందువల్లా, భార్య చనిపోయినందువల్లా మిగిలివున్న ఒక్కగ్రామానికి వచ్చి మకాం పెట్టాడు. ఇక్కడా ఆవున్న కాస్తడబ్బూ తగలెయ్యడం ప్రారంభించాడు కాని ఈ దుబారా మరొకమార్గంలో నడచింది. తన ఇంటిచుట్టూ ఇంగ్లీషువాళ్ళలా ఒకపెద్ద తోట వేయించి, డబ్బంతా దానిపై ఖర్చుపెట్టాడు. తన గుర్రపుశాలలోని నౌకర్లకు ఇంగ్లీషు జాకీల్లాగా దుస్తులు కుట్టించాడు. తన

కూతురికి ఒక ఇంగ్లీషు ఉపాధ్యాయినిని ఏర్పాటు చేయించాడు. తన సేద్యం నాద్యం కూడా అచ్చం ఇంగ్లీషువాళ్ళ పద్ధతుల్లోనే సాగించాడు. కాని,

'అన్యుల పద్ధతి రష్యన్
ధాన్యానికి కుదిరిచచ్చునా ఎన్నటికీన్.'

ఖర్చులు బాగా తగ్గాయికాని ఆదాయం మాత్రం పెరగలా. ఆ కుగ్రామవాసంలో కూడా అప్పులుచేయ డానికి కొత్తమార్గాలు కనుక్కొన్నాడు. తన ఎస్టేటును హైకోర్టుకు తాకట్టుపెట్టడానికి పూనుకొన్న మొట్ట మొదటి భూస్వామి కావడంవల్ల, అతను మంచి ఘటికు డని పేరు. ఇలా తాకట్టుపెట్టడాని కెంతో సాహసమూ, నేర్పూ కావాలని వాడుక ఆ రోజుల్లో. ఇవానొవిచ్ వట్టి అప్రయోజకుడని ఖండించేవాళ్ళల్లో బెరిస్టోవ్ మొదటి వాడు. బెరెస్టోవ్‌కు కొత్తపద్ధతులంటే సుతరామూ గిట్టదు. ఆంగ్లేయపద్ధతులపై గ్రిగొరీ ఇవానొవిచ్‌కి గల మోజు ప్రస్తావనకొస్తే బెరిస్టోవ్ శాంతంగా మాట్లాడ లేకపొయ్యేవాడు. గ్రిగొరీ తప్పులెన్నడమంటే అతనికి విసుగు కలగదు. తన ఇంటికి వచ్చినవాళ్ళకు ఎస్టేటు చూపిస్తున్నప్పుడు వాళ్ళు తన కార్యదక్షతను ప్రశం సించారా, వెంటనే ఇలా సమాధాన మిచ్చేవాడు వ్యంగ్యంగా : "మా పక్క ఎస్టేటుదారు గ్రిగొరీ మోస్త రుగా, ఇక్కడ పనులు చేయించం. ఇంగ్లీషువాళ్ళ తోక

పుచ్చుకోని పాడయిపోవడం మా స్వభావం కాదు. మన రష్యా పద్ధతిలోనే వుండి, కొంపకొల్లేరు జరిగితే మాకదే పదివేలు !"

ఇరుగుపొరుగువాళ్లు అతిశ్రద్ధతో ఇలాంటి విసుర్లనూ, పుల్లవిరుపు మాటలనూ, యథాతథంగా గ్రిగొరీ ఇవానొవిచ్ చెవుల్లో పడవేసి చక్కాపొయ్యేవారు. మన ప్రాతికేయుల్లా విమర్శలను ఏమాత్రమూ సహించలేని ఆ ఆంగ్లేయాభిమాని ఈ మాటలు విని మండిపడేవాడు. బెరిస్తోవ్ ఎలుగ్గొడ్డనీ, పల్లెటూరి ముఖమనీ అవహేళన చేసేవాడు.

ఇరుగు పొరుగున గల ఈ భూస్వాముల మధ్య గల సంబంధా లిలా ఉండగా, బెరిస్తోవ్ కుమారుడు అలెక్సీ పట్నంనుంచి తండ్రిని చూడ్డానికి వచ్చాడు. అతను 'అ' విశ్వ విద్యాలయంలో చదువు పూర్తిచేశాడు. సైన్యంలో చేరుదామని అతని ఆకాంక్ష. కాని తండ్రి ఒప్పుకోవడంలేదు. తను మరేవుద్యోగానికి బొత్తిగా లాయకు కాదని ఆ యువకుని అభిప్రాయం. ఉభయుల్లో ఎవరూ తగ్గరు. ఈలోగా అలెక్సీ పనిపాటల్లేకుండా దర్జాగా తిరుగుతున్నాడు. ఏది ఎలా వస్తుందో ఎందుకైనా మంచిదని కోరమీసంకూడా పెంచుతున్నాడు.

అలెక్సీ నిజంగా అందగాడు. పాపమతని చక్కని ఆజానుబాహు విగ్రహానికి మిలిటరీ యూనిఫారం లేక

పోవడం న్యాయంకాదు అందరూ ముక్కుమీద వేలేసుకొని తన్ను చూస్తూవుంటే, దండు గుర్రంపైన తిరగవలసిన అతను వీపువంచి, వస్త్రాలు తిరగవేసుకొంటూ యౌవనం వృథాచేయడమా ? అలెగ్జీ వేటలో ముందూ వెనుకా చూడకుండా, అందరినీ దాటవేసి, గుర్రంపైన శరవేగంతో దూసుకొనిపోతూంటే చూచిన యువగుపొడుగు వాళ్ళంతా ఇతనెన్నడూ గవర్నమెంటు ఆఫీసుల్లో రాణించడని ఐక్యకంఠంతో అన్నారు. చుట్టుపట్లగల యువతుల కటాక్షవీక్షణాలు కూడ అతనిపై పడ్డాయి. ఆ చూపుల్లో ఒకొకసారి సంభ్రమం కూడ తొంగి చూడడం కద్దు. కాని ఇవి అలెగ్జీ దృష్టిని మాత్రం ఆకర్షించలేకపోయాయి. ఏదో ప్రేమగాథే యీఉదాసీనతకు కారణమని ఆ యువతులు మనస్సుకు తృప్తిచేసుకొన్నారు. దీనికి ఒక ప్రబలమైన సాక్ష్యంగా అతని జాబులో దొరికిన క్రింది అడ్రసు ఒక చేతినుంచి ఒక చేతికి అందించబడింది :"మాస్కోలోని సెయింట్ అలెగ్జిన్ క్రైస్తవ మతానికి యెదురుగా కంచరపనిచేసే సావిల్యేవ్ ఇంటివద్ద గల అకులినా పెట్రొవ్నా కురొచింకా, దయవుంచి నీ వీ జాబు ఎ. యన్. ఆర్. కు అందజేయాలి."

పల్లెటూళ్ళలో కాపురం చేయని పాఠకులకు అక్కడి ఆడవాళ్ళెంత ఆహ్లాదకరంగా వుంటారో తెలీదు. ఆపిల్ చెట్లనీడల్లో, స్వచ్ఛమైన గాలిలో పెరిగి పెద్ద

వాళ్ళౌతారు; జీవితమంటే, సమాజమంటే వీళ్ళకు తెలిసినదంతా పుస్తకాల్లో చదివిందే. ఈ గ్రంథావలోకనం, స్వేచ్ఛ, ఏకాంతవాసం – వీటివల్ల, నాగరిక స్త్రీలఅనుభూతికందని హృదయోద్వేగాలుపల్లెపడుచుల్లో లేత వయస్సులోనే కెత్తుతాయి. గంటల ఘలఘలలకే వాళ్ళ గుండెలు గగుర్పొడుస్తాయి. పక్కనుండే పట్నానికి ఒకసారి వెళ్ళిరావడం వారి జీవితంలో ఒక ముఖ్యమైన సంఘటన. తమ గ్రామానికి బయటివాళ్ళెవరైనా వచ్చి పొయ్యారా వాళ్ళ స్మృతులు ఆ ముగ్ధల హృదయాల్లో చిరకాలం, ఒక్కొక్కసారి జీవితాంతంవరకుకూడ నిల్చిపోతాయి. వీళ్ళలో కొంత ఎబ్బెట్టుగా కనపడే గుణాలు చూచి మనం నవ్వుకోవచ్చు. కాని పైపై మెరుగులు మాత్రమే చూచి వేళాకోళం చేసినంతమాత్రాన వీళ్ళ ప్రధాన గుణాలెక్కడ పోతాయి? వీళ్ళ సౌశీల్యం, జీన్ పాల్ రిచ్ టర్ పేర్కొన్న ఆ "వ్యక్తిత్వం" ప్రధానం. ఇదిలేనివారెవరూ గొప్పవారు కాలేదన్నాడతను. పెద్ద పెద్ద నగరాల్లోని స్త్రీలు పల్లెటూరి పిల్లలకన్న ఎక్కువ చదువుకోవచ్చు. కాని సమాజ ప్రభావంవల్ల ఈ తారతమ్యాలు నశించి, అనతికాలంలోనే అందరి ఆడవాళ్ళ మనస్సులు, వాళ్ళ టోపీల్లాగనే, ఒకే మూసలో పోసినవానిలా అయిపోతాయి. వీళ్ళను ఖండిస్తూనో, లేక

వీళ్ళ గుణగణాలపై తీర్పు చెప్తూనే అంటున్న మాటలు కావవి: ఉన్న విషయమిదీ.

అలెగ్జీని చూడడంతో ఆ పల్లెటూరి అమ్మాయిలెంత ఉక్కిరిబిక్కిరి అయ్యారో సులభంగా ఊహించుకోవచ్చు. యౌవన సహజమయిన భ్రమలు తొలగి విచారగ్రస్తుడై వుండే ఒకయువకుణ్ణి వాళ్ళుచూడడం ఇదే మొదటిసారి. ఇచ్ఛారహస్యంగా తిరిగి, వయస్సు పాడుచేసుకొన్న విషయ మిలా వాళ్ళతో చెప్పిన మగవాడు లేడు. వీటన్నిటిని తలదన్నే విషయమేమంటే, అలెగ్జీ మృత్యుదేవత ముద్రికగల ఒకనల్లని ఉంగరం వేలికి పెట్టుకొన్నాడు. ఇదంతా ఈపిల్లలకు కొత్త; అతణ్ణిచూచి ఆ అమ్మాయిలకు పిచ్చెక్కినట్లయింది.

కాని అలెగ్జీని గురించి అందరికన్నా ఎక్కువగ పట్టించుకొన్న అమ్మాయి లిసా. లిసా గ్రిగొరివిచ్ కూతురు. లిసాతండ్రికీ, అలెగ్జీతండ్రికీ ఏనాడూరాకపోకలు లేవు. కాబట్టి చుట్టుపట్టు పడుచుపిల్లలంతా ఇరవైనాలుగు గంటలూ అలెగ్జీని గురించే మాట్లాడినా, లిసా మాత్రం అలెగ్జీ ముఖు మెరుగదు. లిసాకు పదిహేడేళ్ళుంటాయి. ఆలివ్ వన్నె శరీరం. ఆమె అందమైన మొగానికి మరొక సొగసు నీలాలవంటి ఆ విశాల తరళ నయనాలు. ఒంటి కూతురు కాబట్టి లిసా అడ్డమూ, ఆజ్ఞా లేకుండా గోముగా పెరిగింది. లిసా అల్లరిపనులకు

వాళ్ళ నాన్న స్రి సంతోషంతో ఉప్పొంగిపోతే, ఉపాధ్యాయిని మిస్. జాక్సన్ 'ఇక ఈ పిల్ల బాగుపడడం సున్న' అని నిరాశ చేసుకొని కూర్చొనేది. మిస్ జాక్సన్ 40 ఏళ్ళ మనిషి. బ్రహ్మచారిణి. చెక్కళ్ళకు, కను బొమ్మలకు రంగు వేసుకొనేది. ఆరునెలల కొకసారి మొదటినుంచీ కొనవరకు 'సమేలా' అనే పుస్తకం చదివేది. ఈ కష్టానికై ఆమెకు ముట్టజెప్పుతున్న ప్రతిఫలం సంవత్సరానికి 2 వేల రూబుళ్ళు. పాపం అనాగరికమైన రష్యాదేశంలో పొద్దుపోక చచ్చి సున్నమైపోతూంది మిస్ జాక్సన్.

లిసా కొక పనికత్తె వుంది. దానిపేరు నాస్ట్యా. యజమానురాలికన్న వయస్సులో కొంచెం పెద్దది. కాని అల్లరిలోమాత్రం లిసాకు తీసిపొయ్యేదికాదు. నాస్ట్యా అంటే లిసాకు ప్రాణం. ఇద్దరిమధ్య రహస్యాలంటూ లేవు. లిసా, కొంటె పనులలో పనిమనిషిని తోడుచేసుకొనేది. ఫ్రెంచి విషాదాంత నాటకాల్లోని నాయిక చెలికత్తెకన్న ప్రిలుచినో గ్రామంలో నాస్ట్యా వహించేపాత్ర ప్రముఖమయినదనే చెప్పాలి.

నే నీరోజులల్లా బయటికి వెళ్ళిరానా! అని నాస్ట్యా ఒకరోజు అడిగింది యజమానురాలికి గౌను తొడుగుతూ.

"అవస్యంగా వెళ్ళిరా. కాని ఎక్కడికి వెళ్తుటం ?"

"యుగిరోవ్ గ్రామానికి. బెరిస్టోవ్ గారింటికి వెడుతున్నా. రేపు వాళ్ళ వంటాయనభార్య పుట్టిన రోజట. నిన్న ఆవిడ వచ్చి భోజనానికి పిలిచి పోయింది."

"ఓహో !" అందిలిసా. "యజమానుల మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది. వాళ్ళ నౌకర్లు ఒకరికొకరు విందులు చేసుకొంటున్నారు !"

"మా యజమానుల కొట్లాటలతో మాకేమి పనమ్మా ?" అని నాట్యా అంటించింది. "అదీకాక నేను నీ నౌకర్నికాని మీ నాన్న నౌకరును కాదుగా. నీవూ బెరిస్టొవ్ గారి అబ్బాయీ యింకా కొట్లాడుకోలేదు లే. ఆ ముసలాళ్ళే తాన్లో పేడో తేల్చుకోనీ. మన కెందుకూ అదంతా !"

"సరేకాని, ఎట్లయినా ప్రయత్నంచేసి అలెక్సీ బెరిస్టొవ్ ఎలాంటివాడో ఎట్లుంటాడో, చూచివచ్చి నాకు చెప్పు"

నాస్ట్యా సరే అని వెళ్ళిపోయింది. నాస్ట్యా ఎప్పుడొస్తుందా అని లిసా అదే ధ్యాసతో కాచుకూర్చొంది. సాయంత్రానికి తిరిగొచ్చింది నాస్ట్యా.

"అమ్మగారూ ! బెరిస్టొవ్ వాళ్ళబ్బాయి కనపడ్డాడు. మనిషిని బాగా చూచాను. చూచానేమిటి రోజంతా కలిసేవున్నాం."

"ఏ మేమి? చెప్పూ చెప్పూ! ఏమి జరిగిందో మొదటినుంచీ అంతా చెప్పూ."

"విను చెప్తా! మేమంతా అక్కడికి వెళ్ళాము; నేనూ, అనిస్యా ఎగొరొవ్నా, నెలినా దున్యా..."

"ఆ సోదంతా ఎందుకు! సరే తరువాత?"

ఏమి జరిగిందో మొదటినుంచీ నన్ను చెప్పనీ రాదమ్మా? సరే భోజనం వేళకు అక్కడికి వెళ్ళాం. కోల్చిన్ వాళ్ళ నౌకర్లూ, జర్యేవ్ వాళ్ళ నౌకర్లూ ఆపాటికే అక్కడ వున్నారు. పెద్ద బంట్రోతు భార్యాబిడ్డలు, క్లిఫన్ వాళ్ల పని మనుష్యులు......"

"జెలెస్తొవ్ సంగతి చెప్పవేం..."

"క్షణమాగరాదూ! సరే భోజనానికి కూర్చు న్నాం. మమ్మల్ని ఆహ్వానించిన ఆవిడకు ఒక పక్కన పెద్ద బంట్రోతు భార్య కూర్చుంది. నేనొక పక్క కూర్చున్నా. పెద్ద బంట్రోతు కూతుళ్ళు మూతి బుడగ రించుకొన్నారులే... కాని నాకు వాళ్ళ లెక్కేమిటి!"

"అబ్బబ్బా! ఈ సంగతులన్నీ ఎవరికి కావాలి? వీటితో విసిగించి చంపుతున్నావు".

"అంత ఓపిక లేకుంటే ఎల్లా? సరే, భోజనాల నుండి లేచాం...... భోజనం చేయడానికి మూడు గంటలు పట్టింది....... వంట చాలా బాగుంది లే... ... రంగురంగుల మిఠాయీలు వడ్డించారు. భోజనా

లయిన తరువాత లేచి దాగుడుమూతలు ఆడదామని తోటలోని కెళ్ళాము. చిన్నదొరగారు అక్కడికి వచ్చారు."

"అతను అందమైన వాడనేది నిజమేనా ?"

"ఎంత బాగున్నాడని ! బలే వున్నాడులే...... సన్నగ్గా, పొడుగ్గా, గులాబీరంగు చెక్కిళ్ళు......"

"నిజంగానా ? తెల్లగా ముఖం పాలివుంటాడని అనుకొన్నానే ? అయితే, మనిషి ఎల్లావున్నట్లు నీకు తోచింది ? చింతగా, పరధ్యానంగా వున్నాడా ?"

"అటువంటి దేమీలేదు ! అటువంటి కొంటెమని షిని నే నింతవరకు చూడలేదంటే నమ్ము ! మాతో దాగుడుమూత లాడాడు తెలుసా ?"

"అతను మీతో ఆడడమా ? నిజంగానా లేక తమాషా కంటున్నావా ?"

"మాతో దాగుడుమూత లాడడమే కాదు, అతను దొంగై, మేమెవరైనా దొరికామా అంటే, ముద్దుపెట్టుకొనేవాడు"

"ఛ, ఛ, నీవు కోతలు కోస్తున్నావులే !"

"నా సాక్షిగ చెప్తూతున్నా. అతణ్ని విడిపించుకొని పోవడమే నాకు గగనమైంది. రోజంతా మాతో కలిసేవున్నాడు."

"కాని అతను ఎవరినో ప్రేమిస్తున్నాడనీ, ఎవరి వంక కన్నెత్తికూడ చూడడనీ ఇక్కడ ప్రతిఒకరూ అంటున్నారే?"

"ఉంటే ఉండవచ్చు. కాని నావంక బాగా చూచాడు. పెద్ద బంట్రోతు కూతురు టాన్యా ఉందే దాని వంకా చూచాడు. కోల్‌బిన్‌వాళ్ళ పనిమనిషి పాషాను వదలిపెట్టాడా? ఇప్పుడనుకొంటే వట్టి రౌడీ వెధవ అనిపిస్తూంది. మమ్మల్నెవర్నీ వదలలేదు."

"చాలా ఆశ్చర్యంగా ఉందే! సరే అయితే వాళ్ళింట్లో అతణ్ని గురించి ఏమనుకొంటున్నారు."

"చాలా మంచివాడనే అంతా అంటున్నారు. ఎంతో దయగానూ, అందరితో నవ్వుతూ తేలుతూ వుంటాడట! అతనిలో వుండే లోపం ఒక్కటేమంటే, ఆడపిల్లలవెంట పడటం. కాని నాకేమో అదొక పెద్ద తప్పుగా కనపడడం లేదమ్మా! కొన్నాళ్ళుపోతే అదే పోతుంది."

"అతన్ని చూడాలనిఉందే నాస్ట్యా!" అని లిసా నిట్టూర్చింది.

"అదేమంత కష్టంకాదు. ట్యూగిలోవో మనకు దగ్గరే. రెండు మైళ్ళేగదా? నడిచో, లేక గుర్రాల పైననో అలా షికారు కెళ్ళితే తప్పకుండా నీ కాయన

కనపడతాడు. ప్రతిరోజూ వుదయం తుపాకి తీసుకొని బయటికి వెడతాడట."

"అది కానిపని. నే నతనివెంట పడ్డానని అత ననుకోవచ్చు. అదీకాక మా నాన్నగారికి అతని నాన్న గారికి ఒకరి కొకరికి పడదు. కాబట్టి అతణ్ణి చూడ్డం అసాధ్యం...నాస్ట్యా! నాస్ట్యా! బలే ఆలోచన తట్టింది నాకు. నేను కట్టూ బొట్టూ మార్చేసి, అచ్చం రైతు పిల్లలా తయారవుతాను."

"బలే ఎత్తేశావు! అలా చేయి! చేనేతగుడ్డతో తయారుచేసిన ఒక బ్లౌజు వేసుకొని, 'సరఫాన్'తో ట్యాగి లోవో గ్రామానికి ధైర్యంగా నడచివెళ్ళు. నీవు బరిస్టొవ్ కంటికి పడకపోతే ఒట్టు!"

"నేను రైతుల్లాగానే మాట్లాడగలనుకూడ! నాస్ట్యా! నాస్ట్యా! ఎలాంటి ఉపాయమే!" ఇక ఈ ఆలోచన వెంటనే అమలు జరపాలని దృఢనిశ్చయం చేసుకొని పండుకొంది. లిసా. మరుసటిరోజే దానికి కావలసిన సన్నాహాలు ప్రారంభమయ్యాయి. బజారునుంచి నీలంరంగులో ఉండే ఒక ముదకగుడ్డా, సరఫాన్ తెప్పించి, ఇంట్లో పనిచేసే ఆడవాళ్ళందరినీ పిలిపించి బ్లౌజు తయారు చేయించడానికి నియోగించింది. కొత్తగుడ్డలు తయారయిన వెంటనే వాటిని వేసుకొని అద్దంలో చూచుకొంది

లిసా. అంత అందంగా ఎప్పుడూ లేనని తోచింది. వేషానికి తగినట్లు నటించగలనో లేదో అని రిహార్సల్స్ చేసింది. తలవంచి నమస్కరించడం, మంటితో చేసిన పిల్లి బొమ్మలాగా తల ఇటూ అటూ త్రిప్పుకొంటూ నడవడం, నోటికి గుడ్డ అడ్డం పెట్టుకొని రైతుపిల్ల లాగానే మాట్లాడడం—ఇవన్నీ నాస్త్యా ఆమోదముద్ర పొందాయి. అయితే ఒక్క చిక్కొచ్చిపడింది. పెరట్లోకి వెళ్ళి వట్టి కాళ్ళతో నడవడానికి ప్రయత్నించినప్పుడు, మట్టిపెళ్ళలు, ఇసుక, గులకరాళ్లు, పల్లవ కోమలమయిన ఆమె పాదాలకు ములుకుల్లా గుచ్చుకొన్నాయి. ఈ నొప్పికి లిసా ఓర్చుకోలేకపోయింది. ఈ సమస్య ఎలా పరిష్కరించాలని లిసా సతమతమవుతున్న పరిస్థితిలో నాస్త్యా ఆమె సహాయానికి వచ్చింది. లిసా అడుగుల ఆదితీసుకొని నాస్త్యా పొలంలోకి పరుగెత్తి పోయి, కర్ర జోడు చేసిమ్మని గొల్లకాపరి ట్రోఫిమ్‌తో చెప్పివచ్చింది.

మర్నాడు, చీకటి విచ్చీ విచ్చకనే. లిసా నిద్ర లేచింది. ఇంట్లో అంతా ఇంకా నిద్రపోతూ వున్నారు. గొల్లవాడికోసం ఎదురుచూస్తూ, నాస్త్యా గేటువద్ద నిల్చొని వుంది. కొద్దిసేపటికి గొర్లమంద భూస్వామి ఇంటి పక్కగా కొండకు వెళ్ళాయి మేతకోసం. వెనుకవస్తున్న గొల్లవాడు గేటువద్దవున్న నాస్త్యాకు రంగువేసిన ఒక

చిన్న చెప్పులజత అందించి ఆ పిల్ల ప్రతిఫలంగా ఇచ్చిన 50 కోపెక్కులూ తీసుకొని వెళ్ళిపోయాడు.

లిసా చడీచప్పుడు కాకుండా, రైతుపిల్లలా ముస్తాబై, మిస్ జాక్సన్ తన్నడిగితే ఏమిచెప్పాలో నాస్త్యాకు చెవిలోచెప్పి, దొడ్డిదోవన ఇల్లువదలి పొలంలోకి పరుగెత్తింది.

తూర్పు తెల్లబడుతోంది. మేఘ శకలాలు పీతాంబరాలు ధరించి, లోకబంధువు రాకకోసం శ్రేణులు దరివేచివున్నాయి—జారు చక్రవర్తికోసం కాచుకొన్న ఆస్థానోద్యోగులులా, అద్దంలావున్న వినీలాకాశవీధి, ఉదయకాల మధురిమతుషారకణాలు, మందమారుతం, పక్షుల కలకలం—లిసా హృదయాన్ని పులకరింపజేశాయి. దోవలో తెలిసిన వాళ్ళెవరైనా ఎదురువుతారేమో అనే భయంతో, ఆమె నడక పరుగ్గామారింది. తన తండ్రి ఎస్టేటు సరిహద్దునవున్న చిట్టడివి దగ్గరకు వచ్చేసరికి వేగం తగ్గించింది. అలెగ్జీకోసం కాచుకోవలసినచోటదే. నాస్త్యా గుండె దడదడమని కొట్టుకోసాగింది—ఎందుకో ఆమె కర్థంకాలా

కాని అది, యౌవనోద్వేగంలో మనం తలపెట్టే సాహసం వెనకదాగివున్న భయంతప్ప వేరుకాదు. ఆ సాహసం మనకంత స్పృహణీయం కావడానికి కూడా

కారణం ఈ భయమే. లిసా గుబురుగావున్న చెట్లవద్దకు వెళ్ళింది. వనంలో ఎక్కడనుండో వచ్చే అస్పష్టమైన శబ్దాలు లిసా చెవులబడ్డాయి. క్షణంలో లిసా ఉత్సాహం తగ్గింది. కాని క్రమక్రమంగా ఏవో ఆలోచనలు ఆమెను ముంచెత్తాయి, ఆమె ఇలా ఆలోచించింది: ...... పదిహేడేళ్ళ పడుచుపిల్ల వసంతకాలంలో ఉదయం అయిదారు గంటలమధ్య ఒకవనంలో పోతూ ఏమాలో చిస్తుందో ఎవరు చెప్పగలరు ? ఇలా పరధ్యానంగా ఆమె తోవ నడుస్తోంది. దోవకిరువైపులా ఎత్తైన వృక్షా లున్నాయి. తటాలున పొదలచాటునుంచి ఒక జాగిలం మొరుగుతూ ఆమెవైపుకే పరుగెత్తుకొంటూ వచ్చింది. లిసా భయంతో కెవ్వుమని కేక వేసింది. ఇంచుమించు అదేక్షణంలో 'స్ట్రేగర్'. సంయ్ ! స్ట్రేగర్ ! నోరు ముయ్ !" అని ఒకగొంతుక వినపడింది. పక్కనున్న ఒక పొదచాటునుండి ఒక యువకుడు ప్రత్యక్షమై, "ఏం భయం లేదులే, అమ్మాయ్ ! నా కుక్క కరవదు" అన్నాడు. భయంనుంచి తేరుకొన్న లిసా అవకాశం జారవిడువలేదు.

"నాకు భయమవుతోంది బాబుగారు !" అని భయమూ, సిగ్గూ అభినయిస్తూ అంది: "చూడండి ఆ కుక్క ఎంత భయంకరంగా ఉందో ! అమ్మోయ్ ! నాపైకి మళ్ళీ దూకేలావుంది !" అలెగ్జీ (అతను అలెగ్జీ

అని పాఠకు డిదివరకే ఊహించుకొని వుంటాడు.) ఆ గైతుపడుచు వైపు కళ్ళప్పగించి చూస్తూ ఇలా అన్నాడు:

"నీకు భయంగా వుంటే నేను వెంటవస్తా. నేను నీ వెంటరావడానికి నీకు ఆక్షేపణ లేదుకదూ ?"

"నిన్ను వద్దని ఆపేవాళ్ళెవరు ?" అంది లిసా.

"రోడ్డులో యెవరైనా నడవచ్చుగా."

"మీా దేవ్వరు ?"

"ప్రిలుచినో. నేను కమ్మరిపనిచేసే వాసిలీ కూతుర్ని. కుక్కగొడుగులు ఏరుకోవడానికి ఇక్కడికి వచ్చాను. (లిసా చేతిలో చెట్టు బెరడుతో చేసిన ఒక బుట్ట అటూ ఇటూ ఊపింది.) "మీారెవరు బాబూ! ట్యుగిలోవో గ్రామమా ?"

"ఔను" అన్నాడు అలెక్సీ. "నేను చిన్నబాబు నౌకర్ని". ఆమెకు సమానీకుడైన వాడిలాగానే వ్యవహరించాలని అలెక్సీ అనుకొన్నాడు. కాని లిసా అతనివైపు ఎగాదిగా చూచి పకాలుమని నవ్వింది "మీా మాట నిజంకాదు. నన్నలా బోల్తా కొట్టించలేరు. మీారే చిన బాబుగారని నేను తెలుసుకోలేనా ?"

"ఎందుకలా అనుకొంటున్నావు ?"

"మిమ్మల్ని చూస్తేనే తెలిసిపోతుందిగా."

"ఎలా తెలుస్తుందో చెప్పవేం ?"

"మనిషిని చూస్తే దొరో, నౌకరో పోల్చుకో లేరేమిటి? మీ దుస్తులే వేరు. మీ మాటలే వేరు. కుక్కను పిల్వడంలో కూడ మీకూ మాకూ భేదమే."

లిసానుచూచేకొద్దీ అలెగ్జీ ముగ్ధుడై పోతూన్నాడు. అందమైన పల్లెటూరి పిల్లలతో చనువు తీసుకోవడానికి అలవాటు పడినవాడు కాబట్టి అలెగ్జీ తన చేతిని ఆమె నడుంపైకి పోనిచ్చాడు. కాని లిసా హఠాత్తుగా వెనక్కు గెంతి అతనివైపు తీక్షణంగా చూచింది. అలెగ్జీ లోలోపల నవ్వుకొన్నప్పటికీ, తరువాత ఆమెను తాకడానికి సాహసించలేదు.

"నాతో స్నేహంగా వుండాలంటే, ఇకమీద నీవు యిలా ఒళ్ళుమరచిపోకూడదు. తెలిసిందా?" అని మాత్రి బుడగరించి అన్నది.

"ఇలా మాట్లాడడం నీ కెవరు నేర్పారు?" అని అలెగ్జీ విరగబడి నవ్వాడు. "మీ అమ్మగారి పనికత్తె నాస్టెంకా నేనా? విద్య ఎలా వ్యాపిస్తూందో ఇప్పుడు నాకు తెలిసింది. తను నటిస్తున్న పాత్రను మరచి మాట్లాడుతున్నానని లిసాకు తోచింది. వెంటనే ఇలా అన్నది మామూలు రైతుపిల్లలా. "నేను దొరగారి దేవిడీకి వెళ్ళటం లేదనుకొంటున్నారా ఏమిటి?" అక్కడ ఎన్నో సంగతులు చూస్తూంటం; వింటూంటాం. సరే నేనిక్కడ మీతో మాట్లాడుకొంటూ నిల్చుంటే, నాకు

కుక్కగొడుగులు సున్నే. మీరా దారిని పొండిబాబూ, నేను నా దారిన వెడతా." లిసా వెళ్ళిపోయేదానిలా ముందుకు అడుగేసింది. అలెగ్జి ఆమె చేయిపట్టి ఆపాడు.

"నీ పేరేమి చెప్పవూ" అన్నాడు.

"అకులినా" అన్నది. అకులినా తన కరాంగుళులు అలెగ్జి చేతినుండి విడిపించుకోవడానికి ప్రయత్నిస్తూ.

"నా చేయి వదలండి బాబూ! నేను ఇంటికి వెళ్ళే పొద్దయింది."

"ఐతే, అకులినా! నేను తప్పకుండా వచ్చి మీ నాన్న అకులినాను చూస్తాను."

"ఏమి?" అని లిసా అంది గాభరాపడుతూ. "మీ పుణ్యముంటుంది. ఆ పనిమాత్రం చేయొద్దండి! మీలాంటి పెద్దవాళ్ళతో నేను ఒంటిగా మాట్లాడానని మా ఇంట్లో తెలిస్తే నా పనిపడతారు. మా నాన్న నా ఎముకలు చితగ్గొడతాడు తప్పకుండా."

"అయితే, నిన్ను మళ్ళీ నేను చూచేదెలామరి? చూచితీరాలి!"

"నేను కుక్కగొడుగులకై ఇక్కడకు వస్తానే వుంటా!"

"నా ముద్దు అకులినా, నాకు ధైర్యముంటే నిన్ను ముద్దు కొనేవాణ్ణి. రేపు కలుసుకొందాం. ఇదే టైముకు సరిగ్గా."

"సరే."

"రాకుండా పోయ్యేవుమరి."

"లేదు తప్పకుండా వస్తా."

"ఒట్టు పెట్టుకో!"

"దేవునిసాక్షిగా వస్తానని ప్రమాణంచేస్తా."

తరువాత ఇద్దరూ విడిపోయారు. లిసా అడవి వెలువడి, పొలంపై అడ్డంగాపడి పరుగెత్తుకొంటూ వచ్చి తమ తోటలో ప్రవేశించింది. అక్కడ తనకోసం నాన్స్టీ కాచుకొనివున్న కళ్ళంలోనికి ఒక్కపరుగులో వచ్చిపడింది. అక్కడా దుస్తులుమార్చుకొని, నాన్స్టీ అడిగే ప్రశ్నలకు పరధాన్యంగా సమాధానమిస్తూ, పడసాలలోకి వచ్చింది. ఉదయోపహారానికి టేబిల్పైన అంతా సిద్ధంచేసి వుంచారు. మిస్ జాక్సన్ ఇంతిపెందలాడైనా, అప్పటికే ముఖంపైన పౌడరు పులుముకొని, కందిరీగలాగా నడుము అక్కళించుకొనేటట్టు ముస్తాబై, రొట్టెను చిన్న చిన్న ముక్కలుగా కోస్తూ కూర్చున్నది. వేకువనే లేచి వాహ్యాళికి వెళ్లివచ్చినందుకు లిసాను వాళ్ళ నాన్న అభినందించాడు. "పొద్దుపుట్టకముందే నిద్రలేవటంకన్న ఆరోగ్యకరమైంది మరొకటిలేదు" అని అన్నాడు. తరువాత దీర్ఘాయువులైనవారిని గూర్చి ఇంగ్లీషు పత్రికలు ప్రచురించిన ఉదంతాలను ఏకరవుపెడుతూ ఒక చిన్న

ఉపన్యాసం దంచాడు. నూరేండ్లకుపైన జీవించిన వారంతా ఓడ్కాను ముట్టిఎరుగరని, చలికాలం ఎండాకాలం అనిలేకుండా ప్రతిరోజూ సూర్యోదయానికి ముందే నిద్ర లేచేవారనీ వివరించాడు. తండ్రి అంటున్నమాట ఒక్కటికూడా లిసా చెవిలో దూరడంలేదు. ఉదయం జరిగిన సంఘటనల్నీ, అకులినాకూ, అడవికి వేటకు వచ్చిన ఆ యువకునికీ మధ్య జరిగిన సంభాషణ నెమరువేసుకొంటూవుంది లిసా మనసులో. తను తప్పుచేశానేమో అని లిసాను అంతరాత్మ బాధింపసాగింది. తమ సంభాషణ సభ్యతను, మర్యాదను అతిక్రమించలేదనీ, తన యీ కొంటెచేష్ట ఎలాంటి దుష్పరిణామాలకు దారితీయజాలదనీ తనకు తాను ధైర్యం చెప్పుకొన్నది. కాని అంతరాత్మకు తృప్తి కలుగలేదు. మరుపటిరోజు వచ్చి కలుసుకొంటానని తను మాట యిచ్చినందుకు పశ్చాత్తాపపడింది. మాట నిలబెట్టుకోనవసరం లేదులెమ్మని కూడ అనుకొంది. కాని అలెక్జీ తనకోసం కాచుకూర్చుని, తాను రాకపోయేసరికి వాసిలీ యింటికి వెళ్ళి, కనుమల మొగంతో, స్థూలకాయంతో అందవికారంగా వుండే నిజమైన అకులినానే చూస్తే ఏం గతికాను? తన రహస్యం బయటపడవచ్చు! లాభంలేదు. రేపు వెళ్ళి అలెక్జీని కలుసుకోక తప్పదని లిసా నిశ్చయించుకొంది.

ఇక అలెగ్జీ సంగతి. అతని ఆనందానికి మితిలేదు. ఆరోజంతా, తనకు కొత్తగా పరిచయమైన అమ్మాయిని గురించిన ఆలోచనలు తప్ప వేరే చింతేలేదు. ఆ రాత్రి కలలోకూడా ఆ పిల్లే. ఇంకా చీకటి వుండగానే నిద్ర లేచి గుడ్డలేసుకొని, తుపాకి బారుచేసుకోకుండానే, స్పోగను (కుక్క) వెంటబెట్టుకొని సంకేత స్థలానికి బయలుదేరి వెళ్ళాడు. అర్ధగంట గడిచింది. ఆ అరగంటా ఆకుయుగాల్లా తోచిందతనికి. తుదకు ఒక నీలం సరఫాన్ దూరంలో కదలుతూన్నట్లు పొదలగుండా కనిపించింది. ఒక్క గంతువేసి అకులినాకు ఎదురేగాడు. ఎదురువస్తున్న అలెగ్జీనిచూచి లిసా మందహాసం చేసింది. కాని ఆమె ముఖంలో తొంగిచూస్తున్న విచారమూ, ఆందోళనా అలెగ్జీ క్షణంలో పసిగట్టాడు. కారణ మడిగాడు. తాను చేస్తున్న పని మంచిదికాదనీ, ఇందుకు తాను పశ్చాత్తాప పడుతున్నదనీ, ఐనా, మాట తప్పడం ఇష్టంలేక రావడమేకాని, తాము కలుసుకోవటం మిదే ఆఖరుసారనీ, తప్పకుండా ఇద్దరికీ చేటుతెచ్చే ఈ స్నేహా మింతటితో తెంచుకొమ్మనీ లిసా అతణ్ణి బ్రతిమాలింది. ఇదంతా పల్లెటూరి రైతులు మాట్లాడే భాషలోనే చెప్పినా, అమాయకురాలయిన ఒక రైతు బిడ్డలో ఇలాంటి భావాలు ఉండటంచూచి అలెగ్జీకి ఆశ్చర్యమయింది. అకులినానిశ్చయాన్ని మార్పించడానికై

తన వాక్చాతుర్యమంతా వినియోగించాడు. తన కేటు వంటి దురుద్దేశాలూ లేవని ఒట్టుపెట్టుకున్నాడు. ఆమె పశ్చాత్తాపపడవలసిన అవసరం కల్పించననీ, ఆమె ఎలా చెప్పితే అలా నడచుకొంటాననీ అన్నాడు. రెండు రోజుల కొకసారో, అదీ సాధ్యం కాదంటే, వారాని కే రెండుసార్లయినా సరే ఇద్దరూ కలుసుకొనే అవకాశ మివ్వమని లిసాను ప్రాధేయపడ్డాడు అలెగ్జీ. హృదయం ప్రేమరసోద్వేగ్నమైనప్పుడు వెల్వడే మాటలే వాడాడు. నిజంగా లిసాను ప్రేమిస్తున్నాననికూడ అనుకొన్నాడు ఆక్షణంలో. లిసా మౌనంగా అతని మాటలు విని, అతను చాలిస్తూనే ఇలా అన్నది: "పల్లెలో నా కోసం చూడకూడదు. నా సంగతి ఎవరినీ అడగకూడదు. నేను చెప్పినప్పుడు తప్ప, మరెప్పుడూ నన్ను కలుసు కోవాలని ప్రయత్నించకూడదు. అలా మాట ఇవ్వండి." దేవుడి సాక్షిగా అలానేకానీ అని అలెగ్జీ ఒట్టుపెట్టుకో బోతుంటే, లిసా అతణ్ణి చిరునవ్వుతో ఆపి, "నాకు ఒట్టు అక్కరలేదు, నీ మాటచాలు అంది. తరువాత ఇద్దరూ చిరకాల మిత్రుల్లా కబుర్లు చెప్పుకొంటూ, వనంలో అటూ ఇటూ తిరిగారు కొంతసేపటికి లిసా "ఇక నేను వెళ్ళాలి" అంది. ఇద్దరూ విడిపోయ్యారు.

లిసా వెళ్ళిపోయిన తరువాత అలెగ్జీకి అర్థమయింది అకులినా తన్ను పూర్తిగా లోగొన్నదని. కాని, రెండు

సాన్ని కలుసుకొని మాట్లాడడంతోనే యీ పల్లెటూరి పిల్ల తనపై యింత అధికారం ఎలా సంపాదించిందో అలెగ్జీకి అర్థంకావటంలేదు. అకులినాతో తన కేర్పడిన యీ సంబంధాలు అపూర్వమైనందువల్ల అలెగ్జీని మరింత సమ్మోహితుణ్ణి చేశాయి. ఆ పిల్ల తన్నడిగిన వాగ్దానాలు భస్మాసుర వరాల్లాగా కనబడినా, వాటిని అతిక్రమించాలనే భావం అతని బుర్రలో ప్రవేశించలేదు. నిజం చెప్పాలంటే, మృత్యుదేవత ముద్రిక గల ఉంగరం, రహస్యమైన ఉత్తర ప్రత్యుత్తరాలూ, భగ్నజీవి ఫోజూ, యివన్నీ ఎలావున్నా వాస్తవంలో అలెగ్జీ కల్లాకపట మెరుగని యువకుడు. అమాయకమయిన వేడ్కలకే పొంగిపోయే నిష్కళంక హృదయ మతనిది.

నా ఆనందం కోసమే ఈ కథ రాస్తూవుంటే ఈ యువతీ యువకుల రహస్య సమావేశాలను, రోజు రోజుకు ఒకరి యందొకరికి పెరుగుతూన్న విశ్వాసానురాగాలను, వాళ్ళ సంభాషణలను ఇక్కడ విపులంగా వర్ణించి వుండేవాణ్ణి: కాని చాలామంది పాఠకుల కివి రుచించవని నాకు తెలుసు. నిజంగా అలాంటి వర్ణనలు పేలవంగా వుంటాయి. కాబట్టి ఒక్క మాట మాత్రమే చెప్పి అవి వదలివేస్తున్నాను. రెండు నెలలు దాటకముందే అలెగ్జీ ప్రేమపాశంలో పూర్తిగా చిక్కుపడ్డాడు. బయటికేమంత కనిపించక పోయినా, లిసా కూడా

అదే స్థితిలో ఉంచె. ఇద్దరూ నేటితో లీనమై రేపటి సంగతి పట్టించుకో లేదు.

అప్పుడప్పుడు పెళ్ళిమాట వాళ్ళ మనస్సుకు రాకపోలేదు. కాని ఆ సంగతి ఇద్దరిలో ఎవరూ ఎత్తలా. కారణం తెలిసినట్లే వుంది. అలెక్సీ అకులినాను ప్రేమిస్తున్నా, తనకూ, ఆ పల్లెటూరి రైతుపిల్లకూ గల అంతరం అతని మనసులో మెదులుతోంది. ఇక లిసాకు, తన తండ్రీ, అలెక్సీ తండ్రీ వైషమ్యాలు మాని రాజీ పడతారనే ఆశ లేదు. పైగా, నవలల్లోలాగా ట్రుగిలోవో ఎస్టేటు వారసుడు ప్రిలుచినో గ్రామం కమ్మరివారి కూతురు కాళ్ళపైబడి 'నీతోడిదే నాకు లోకం' అని ఏనాటికైనా బతిమలాడకపోతాడా అనే ఒక అవ్యక్తపు టాశ లిసా హృదయంలో దాగి లిసా అహంకారాన్ని చక్కిలిగింత పెడుతోంది. అయితే, ఇంతలో వారి పరస్పర సంబంధాలను తల్లక్రిందులు చేసిన ఒక ముఖ్యమైన సంఘటన జరిగింది.

చలివేస్తూ మనస్సుకు హాయిగావుండే ఒకానొక రోజు ఉదయం (రష్యాలో ఆకురాలుకాలంలో ఇలాంటి ఉషస్సులు తరచుగా వస్తుంటాయి) ఇవాన్ పెట్రోవిచ్ బెరిస్టోవ్ గుర్రమెక్కి షికారు వెళ్ళాడు. అదృష్టవశాత్తు ఏ కుందేలో, బందేలో కనపడినా కనబడవచ్చునని అయిదారు వేటకుక్కల్ని, గుర్రపువాణ్ణి, కొంతమంది

కాలుదార్ల పిల్లల్ని వెంటబెట్టుకొని బయలుదేరాడు. బహు సక్కని ఆ వాతావరణం చూచి, గ్రిగోరీ ఇవనోవిచ్ మురోమ్‌స్కీ కూడ సరిగ్గా అదే సమయంలో గుర్రానికి జీను వేయమని చెప్పి, ఎస్టేటులో స్వారీకి బయలుదేరాడు. అతను ఎస్టేటు సరిహద్దులో వున్న చిట్టడివి దగ్గరకు వెళ్లిన సమయంలోనే ప్రక్క ఎస్టేటుదారు ఉన్నికోటు ధరించి గుర్రంపై నిటారుగా కూర్చొని, వెంటవచ్చిన పిల్లల పెడబొబ్బలతో పొదల్లోనుంచి బయటికి తరుముతున్న కుందేలుకోసం కాచుకొని వున్నాడు. ఇది కనుక ముందుగా తెలిసి వుంటే గ్రిగోరి ఇవనోవిచ్ తన గుర్రాన్ని యింకొక వైపు తిప్పివుండేవాడు. కాని అకస్మాత్తుగా, పిస్తోలుగుండు పారేంత దూరంలో బెరిస్టోవ్ తన కభిముఖంగా నిల్చొని వున్నాడు. ఇక చేసేదేముంది ? మురోమ్‌స్కీ అణువణువునా ఐరోపా పట్నవాసం నాగరికత జీర్ణించిన మనిషి. కాబట్టి తన శత్రువువద్దకు గుర్రం పోనిచ్చి గంభీరంగా అభివాదం చేశాడు. ఇనుప గొలుసులతో బంధింపబడిన ఎలుగుబంటి యజమాని ఆజ్ఞపై, ప్రేక్షకుల కెంత ఇష్టంగా సలాంకొడుతుందో అంత యిష్టంగా బెరిస్టోవ్ తలవంచి ప్రత్యభివాదం చేశాడు. ఆ క్షణంలో కుందేలు చెట్లమాటునుంచి బయటికి వెల్వడి, పొలాల వెంట పరుగెత్త నారంభించింది బెరిస్టోవ్ వెంటనున్న గుర్రపు వాడూ ఈల వేసి కుక్కల్ని ఉసికొల్పి, తామూ కుందే

లును తరుముకొంటూ రివ్వుమని దూసుకుపోయారు. మురోమ్‌స్కీ ఎక్కిన ఆడగుర్రం వేట కలవాటుపడింది కాదు. ఈ హడావుడికి బెదిరిపోయి, చెంగున ఎగిరి పరుగు లంకించుకొంది. మురోమ్‌స్కీ గుర్రపుస్వారీలో ఘటికుణ్ణని చెప్పుకునేవాడు. కాబట్టి, కళ్ళెం వదలి గుర్రాన్ని యథేచ్ఛగాపోనిచ్చాడు. పైగా, బెరిస్టోవ్ పీడ ఇంతటితో వదలిపోయిందిలెమ్మని సంతోషించాడుకూడ. దారిలో ఒక డొంక అడ్డమయ్యేసరికి, ఆ పెంటి గుర్రం తటాలున పక్కకు తిరిగింది. మురోమ్‌స్కీ గుర్రంపైన నిలదొక్కుకోలేక దబ్బున కిందబడ్డాడు. అతనికి తలగొట్టి నట్లయింది. లేవలేక గుర్రాన్ని చెడతిడుతూ నేలపైన అలాగే పడివున్నాడు. రాతు లేకపొయ్యేసరికి గుర్రమూ ఆగింది బుద్ధి వచ్చినదానిలా. ఇవాన్ పెట్రోవిచ్ మురోమ్‌స్కీవద్దకు గుర్రాన్ని పోనిచ్చి "దెబ్బతగిలిందా" అని పరామర్శించాడు. అతనినే కాదు కళ్ళెం పట్టుకొని తప్పుచేసిన ముద్దాయిని తీసుకొని వచ్చి, మురోమ్‌స్కీని లేవనెత్తి గుర్రంపైన కూర్చోపెట్టాడు. ఇలాంటి పరిస్థితుల్లో ఎవరిదారిన వారు వెళ్ళలేరుగదా! బెరిస్టోవ్ మురోమ్‌స్కీని తన ఇంటికి రమ్మని ఆహ్వానించాడు. రానని చెప్పడం మర్యాదకాదని మురోమ్‌స్కీకి అనిపించింది. ఇలా బెరిస్టోవ్ జయభేరితో ఇంటికి తిరిగి వచ్చాడు.

కుంటేలునేకాక గాయపడిన శత్రువును యుద్ధఖైదీగా తీసుకొచ్చాడు.

ఈ ఇద్దరు ఇరుగుపొరుగువాళ్ళూ ఉపహారానికి కూర్చుని స్నేహితుల్లాగానే మాట్లాడుకొన్నారు. గుర్రం నుంచి పడినదెబ్బకు మురోమ్స్కీకి ఒళ్ళంతా కుదించి వేసినట్టుంది. కాబట్టి గుర్ర మెక్కేపాటి వ్యవస్థలో లేనని బండి ఏర్పాటుచేయమని బెరిస్టోవ్‌తో అన్నాడు. అతిథిని సాగనంపడానికి బెరిస్టోవ్ గేటువరకు వెళ్ళాడు. కొడుకూ, తానూ ఇద్దరూ మరుసటిరోజు తమ ఇంటికి భోజనానికి వస్తామని బెరిస్టోవ్ మాట యిచ్చిన తరువాతకాని మురోమ్స్కీ కదలలేదు. ఇలా, ఒక బెదిరే పెంటిగుర్రం పుణ్యమాఅని చిరకాలంగా పాతుకొనిపోయిన పాత మనస్తాపాలు అంతమయ్యే సూచనలు కనబడ్డాయి.

ఇవానోవిచ్ వస్తూవుండగానే, లిసా బయటికి పరుగెత్తుకొని వచ్చింది.

"ఏమయింది నాన్నా!" అని ఆశ్చర్యంతో అడిగింది. "ఎందుకు కుంటుతున్నావు? నీ గుర్రమేది? ఆ బండెవరిది?"

"ఏం చెప్పను చిట్టితల్లీ అంటూ జరిగినదంతా చెప్పాడు కూతురుకి. లిసా తన చెవులనే నమ్మలేక పోయింది. తన్ను ముంచెత్తిన ఆశ్చర్యంనుంచి లిసా తేరుకోకనే, మురోమ్స్కీ మరుసటిరోజు ఇవాన్ పెట్రో

విచ్ బెరిస్ట్రోవ్ కొడుకుతో కూడ భోజనానికి వస్తున్న విషయం చెప్పాడు.

"బెరిస్ట్రోవ్‌లు, తండ్రీకొడుకు లిద్దరూనా? రేపు మనింటికి భోజనానికి వస్తున్నారా? నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో నాన్నా! నేను మాత్రం వాళ్ళతో కలిసి భోంచేయను."

"నీ కేం పిచ్చిపట్టిందా ఏమిటి?" అని తండ్రి ఎగిరాడు. "ఉన్నట్టుండి ఇంత సిగ్గెందుకు నీకు? పూర్వ కుల ద్వేషం నీకూ పట్టుకొందా, ఏదో నవలలోని కథానాయికలాగా. ఇక ఇలాంటి పిచ్చివేషాలు నేను సాగనీను..."

"లేదు నాన్నా! నీవు లక్ష చెప్పు. ఆరు నూరైనా, నూ రారైనా, నేనుమాత్రం బెరిస్ట్రోవ్‌ల కంటపడను!"

లిసాకు ఎదురు చెప్పడంవల్ల ప్రయోజనం లేదని తండ్రికి తెలుసు. నీ యిష్టము లెమ్మన్నట్టు భుజాలూపి, వాగ్వాదం ఆపి, విశ్రాంతి తీసుకోవడానికై లోపలికి వెళ్ళి పండుకొన్నాడు.

లిసా తన గదిలోనికి వెళ్ళి నాస్త్యాను పిలిపించింది. ఇద్దరూ మరుసటిరోజు యింట్లో జరుగబొయ్యే ఆతిథ్యాన్ని గూర్చి చాలాసేపు సమాలోచనలు జరిపారు. గౌరవంగా పెరిగిన ఆ యింటి ఆడుబిడ్డే తన అకులినా అని తెలిస్తే అలెక్సీ ఏమనుకొంటాడు? ఆమె ప్రవర్తన, గుణం, నీతి

నియమాలు గురించి అతని కెలాంటి అభిప్రాయం ఏర్పడు తుంది? కాని, ఇలాంటి హాతాత్సన్ని వేశంలో అలెక్సీ ఎలా వుంటాడో, ఏం మాట్లాడుతాడో చూడాలనే కుతూహల మొకటి లిసాలో కలిగింది. అకస్మాత్తుగా ఆ పిల్ల కొక ఆలోచన తట్టింది: "ఈ ఆలోచన ఎలా వుందే?" అని నాస్త్యా నడిగింది. ఇద్దరూ బాగుం దను కొన్నారు. ఏమైనా సరే దాన్ని ఆచరణలో పెట్టాలని నిశ్చయం చేసుకొన్నారు.

మరుసటిరోజు ఉదయం ఉపాహారం ముందు యిద్దరూ కూర్చొన్నప్పుడు, మురోమెస్కీ కూతుర్ని అడిగాడు. "బెరిస్టోవ్ లకు కనపడకుండా దాక్కోవాలనే ఇంకా అనుకొంటున్నావా?" అని.

"సరే, నీవింతా చెప్పుతున్నప్పుడు కాదనడం బాగాలేదు. వాళ్ళకు తగిన మర్యాదచేసి పంపుతానులే నాన్నా" అని అన్నది. "అయితే నాదొక షరతుంది. నా వేషం ఎలా వున్నా, నే నేమి చేసినా నీవు నన్ను కోపగించుకోవడం కాని, నవ్వడంకాని, కనీసం ఆశ్చర్యం కనపరచడం కాని - చేయకూడదు! సరేనా?"

"మళ్ళీ ఏదో కోతిచేష్ట తలపెట్టావన్నమాట!" అన్నాడు తండ్రి నవ్వుతో. "సరే నీ ఇష్ట మెట్లుంటే అట్లే కాని కొంటె కోణంగి!" ఇలా అని ఆమె నుదురు

ముద్దుపెట్టుకొన్నాడు. లిసా మధ్యాహ్నానికి తగిన సన్నాహాలు చేయడానికి వెళ్ళిపోయింది.

సరిగ్గా రెండు గంటలకు ఆరు గుర్రాలు కట్టిన పల్లెటూరి బగ్గీ ఆవరణలోని శాద్వలస్థలి దాటి ఇంటి ముంగిట వచ్చి నిలబడింది. యూనిఫారాలు ధరించిన ఇద్దరు నౌకర్లు వచ్చి, బెరిస్టోవ్‌ను సింహద్వారం మెల్లె క్కించారు. మరుక్షణంలో గుర్రమెక్కి అలెక్సీకూడా వచ్చి తండ్రి వెంట భోజనశాల ప్రవేశించాడు. మురోమ్స్కీ అతిథుల కెదురేగి ఎంతో మర్యాదచేసి, భోజనాలకు ముందు తన తోటను, అశ్వశాలను చూపించడానికి వారిని తీసుకువెళ్ళాడు. చదునుచేసి, ఊడ్చి, అద్దంలా వుంచిన దోవలూ, అవీ చూస్తూ బెరిస్టోవ్ "అయ్యో, ఈ పిచ్చిపనుల కెంత డబ్బు తగలేస్తున్నాడు!" అని విచారించాడు. కాని మర్యాదకోసం, బయటికి ఏమీ అనలేదు. అలెక్సీకి, తన తండ్రికి కల్గిన విచారం కాని, గుడ్డిగా ఆంగ్లేయులను అనుకరించే మురోమ్స్కీ ఉత్సాహం కాని కలగలేదు. గృహస్థుకూతుర్ని చూడాలనే కుతూహల మొక్కటే అతని మనస్సును ఆవరించింది. ఆమె విషయమై అలెక్సీ చాలా విన్నాడు. తన హృదయం మరొకరికి అర్పితం చేసినప్పటికీ, అందమైన అమ్మాయంటే, అతని గుండె పులకరించడం మానలేదు.

ముగ్గురూ మళ్ళీ యింట్లోకివచ్చి కూర్చున్నారు. ముసలివాళ్ళిద్దరూ గడచిపోయిన రోజులను గురించి, తాను మిలటరీలో వున్నప్పటి సంగతుల్ని గురించి కబుర్లు చెప్పుకొంటున్నారు లిసా సమక్షంలో తనెలా ప్రవర్తించాలో అలెక్సీ ఆలోచించుకొంటూన్నాడు. గంభీరంగా మౌనముద్రవహించి ఉదాసీనంగా వున్నట్టు కనపడాలని నిర్ణయించుకొని అందుకు తయారవుతూన్నాడు. ఇంతలో తలుపు తెరచుకొంది. ఆరితేరిన కిలాడీకి కూడా గుండెబెదురు కలిగించే తూష్ణీభావంతో అలెక్సీ తలతిప్పి చూచాడు. కాని దురదృష్టశావత్తు లోపలికి వచ్చింది లిసా కాదు; మిస్. జాక్సన్. ముఖం నిండా పౌడరు పులుముకొని ముస్తాబై నేల చూపులు చూస్తూ, లోపల ప్రవేశించి అభివాదం చేసింది. అలెక్సీ పన్నిన బ్రహ్మాండమైన సైనిక వ్యూహం వృధా శ్రమ అయింది. ఈ ఆశాభంగంనుండి తేరుకోకమునుపే, మళ్ళీ తలుపు తెరచుకొంది. ఈసారి గదిలో ప్రవేశించింది లిసాయే. అందరూ పైకిలేచారు. మురోమ్‌స్కీ అతిథులను పరిచయం చేయబోతూ, తటాలున ఆగి, పెదవి కొరుక్కొన్నాడు...లిసా. శ్యామలాంగి అయిన తన ముద్దు లిసా చెవులవరకు దట్టంగా పౌడరు మెత్తింది మిస్. జాక్సన్‌తో పోటీపడుతున్న దానిలా. లూయీక్వాటో విగ్గులా ఉంగరాలు తిరిగిన కృత్రిమ శిరోజాలు ధరించింది.

మదాం పాంపడోర్ కంచుకంలా, లిసా ధరించిన గౌను చేతి అంచులు నిక్కబొడుచుకొని వున్నాయి. శరీరానికి బిగదీసి కట్టినట్టుగా వున్న దుస్తులతో, ఆమె ఆకారం రోమన్ లిపిలోని 'x' అక్షరంలా ఉంది. తల్లి ఆభరణాల్లో తాకట్టుకుపోగా మిగిలినవన్నీ - వజ్రాల తాటంకాలు, హారాలు, అంగుళీయాలు - ఆమె శరీరం పైన ధగధగమని మెరుస్తున్నాయి. ఒక విధంగా అసభ్యతంగా వున్నా, పగటివేషంలావున్న ఈవిడ అకులినా అని అలెక్సీ పోల్చుకోలేకపోయాడు. అతని తండ్రి లేచి లిసా చేయి ముద్దుపెట్టుకొన్నాడు. అయిష్టంతో, అలెక్సీ కూడా తండ్రిని అనుకరించాడు. తన పెదవు లామె తరుణాంగుళులను స్పృశించినప్పుడవి కొద్దిగా కంపించినట్లు అలెక్సీకి తోచింది. తను తొడిగిన అందమైన స్లిప్పర్లు కనపడాలనే ఉద్దేశ్యంతో లిసా ముందుకు చాచిన చిన్నని కోమలపాదం కూడ అలెక్సీ కంటపడింది. దీనితో లిసా వేషం చూచినప్పుడు కలిగిన ఏవగింపు తగ్గింది. పోతే లిసా ముఖానికి పులుముకొన్న పౌడరూ, రంగూ అలెక్సీ గమనించనే లేదు; తరువాతకూడా ఈ విషయమై అతనికి అనుమానం కలగలేదు. ఇక గ్రిగోరి ఇవానోవిచ్ కూతురికి తనిచ్చిన మాట జ్ఞప్తి తెచ్చుకొని లవలేశమైనా ఆశ్చర్యం కనిపించనేలేదు. కాని లిసా కొంటెతనం చూచి పట్టకుండా

నవ్వొస్తోంది. ఆ నవ్వాపుకోవడమే అతనికి కష్టమయింది. కాని మిస్ జాక్‌సన్ కిది నవ్వులాటగా తోచలేదు. ఆమె చాలా పట్టింపు మనిషి. లిసా పౌడరూ, రంగూ తన టేబిల్లోంచి దొంగిలించిందని ఆమె ఊహించింది. కోపం వచ్చి ఆమె కపోలాల కృతక పాండిమం క్రింద రక్తారుణిమ పల్లవించింది. లిసావైపు సూదులు చూస్తూ కూచ్చుంది. కాని లిసా ఇది గమనించనట్టే నటించసాగింది. తరువాత క్షమాపణ చెప్పుకొందాములెమ్మనే ధీమాతో.

భోజనాలకై టేబిల్ ముందు కూర్చున్నారు. అలెక్సీ పరధ్యానంగా వున్నట్టు నటిస్తూన్నాడు. లిసా వెకిలిగా నవ్వుతూ, యాసగా, మునిపంట్లు బిగించి, ఫ్రెంచి భాషలో మాట్లాడుతూంది. తండ్రి, కూతురు వైపే చూస్తూ కూర్చున్నాడు. లిసా ఇలా చేస్తున్న కారణమేమో ఆయనకు తెలీ లేదు కాని, ఇదంతా బలే తమాషాగా వుందనిమాత్ర మనుకొన్నాడు. మిస్ జాక్‌సన్‌కు కోపోద్రేకంతో మాటలే పెగలడం లేదు. ఇక, అక్కడ వున్న వారితో యథేచ్ఛగా మాట్లాడుతూ, తింటూ కూర్చున్నవాడొక్క ఇవాన్ పెట్రోవిచ్ మాత్రమే. ఇద్దరికి సరిపడా తిని, తాగి, తన హాస్యోక్తులకు తానే నవ్వుతూ, ఎంతో స్నేహభావంతో కబుర్లు చెప్పుతూ కూర్చున్నాడు.

భోజనాలయినతరువాత అతిధులు వెళ్ళిపోయారు. గ్రిగొరి ఇవానోవిచ్ కడుపు చెక్కలయ్యేలా నవ్వుతూ లిసావైపు తిరిగి ఇలాఅన్నాడు: "వాళ్ళ కళ్ళు కప్పాలని ఎందుకనుకున్నావు? సరేకాని, పౌడరు నీమొగానికి చాలాబాగుంటుంది. మీ ఆడవాళ్ళ ముస్తాబు సంగతి నాకు తెలియదు. నేను నీ స్థానంలోవుంటే తప్పకుండా పౌడరు వాడుతాను. మరీ వేషం వేసుకున్నట్టుకాదు, కొద్దిగా" తన ఎత్తు ఫలించినందుకు లిసా సంతోషం పట్టలేకపోయింది. తండ్రిమెడకు చేతులుచుట్టి, అతని సలహాను గురించి ఆలోచిస్తానని చెప్పి పరుగెత్తి పోయింది-మిస్ జాక్సన్ కోపం తీర్చడానికై. కాని లిసాఎంతోసేపు బతిమలాడిన తరువాతకాని మిస్ జాక్సన్ తన గదితలుపు తీసి లిసా క్షమాపణ వినడానికి సిద్ధపడలేదు. "నేను నల్లటిదాన్ని. నా నలుపుచూచి కొత్తవాళ్ళు నవ్వి పోతారేమోనని సిగ్గయ్యింది...మిమ్మల్ని పౌడరు అవీ అడగడానికి సంకోచించాను...వెన్నలాంటి మనస్సుమీది... తప్పకుండా క్షమిస్తారనుకొన్నా..."వగైరా వగైరా మాటలతో మిస్ జాక్సన్ గమ్మత్తై పోయింది. తన్ను వేళాకోళం చేయడానికి నాటక మాడలేదని మిస్ జాక్సన్‌కు నమ్మకం కుదిరి శాంతించింది. లిసాను ముద్దు పెట్టుకొని, రాజీపడినందుకు సూచకంగా లిసాకు ఒక జాడీ ఇంగ్లీషు ఫేస్‌పౌడరు బహూకరించింది. ఎంతో

కృతజ్ఞత కనపరుస్తూ, లిసా వాటిని తీసుకొని వెళ్ళి పోయింది.

మరుసటిరోజు లిసా సంకేత స్థానానికి వెళ్ళిందని పాఠకులు సులభంగా వూహించే వుంటారు. అలెగ్జీని చూచిన మరుక్షణమే లిసా అడిగింది;

"మీరు మా ఎస్టేటు యజమాని ఇంటికి వెళ్ళారు కదా. మా చిన్న దొరసానిగారిని గురించి మీ అభిప్రాయ మేమి?"

తా నామె నంత గమనించి చూడలేదని అలెగ్జీ అన్నాడు.

"పొరపాటు చేశారు" అంది లిసా.

"ఎందుకు?"

"ఎందుకంటే, అందరూ అనేమాట నిజమేనా అని మిమ్మల్ని అడగాలని అనుకొన్నాను."

"అందరూ ఏమంటారు?"

"జనమంతా నేను, ఆమె ఒకే పోలిక అని అంటారు."

"ఛ! ఛ! సంబంధమేమి? నీతో పోలికే లేదు, ఆమె దయ్యంలా ఉంది."

"అయ్యో బాబూ! మీ రలా అనకూడదు. మా చిన్న దొరసాని ఎంత అందంగా, ఎంత నాజూకుగా వున్నారు! నాతో ఆమెకు పోలికేమిటి?" అని లిసా అంది.

ప్రపంచంలోని స్త్రీ లెవ్వరూ అకులినాకు దిగ దుడుపుకు కూడ తరంకారని అన్నాడు అలెక్జీ ప్రమాణం చేస్తూ. ఇక అకులినా అనుమానాలను పోగొట్టడానికి చిన్న దొరసాని వేషభాషలు వెక్కిరిస్తూ వర్ణించాడు. లిసా నవ్వాపుకో లేకపోయింది.

"మీ రనేది నిజమే కావచ్చు. కాని మా దొర సానితో పోలిస్తే, నేను ఒక్క అక్షరంముక్క రాని మొద్దును కదూ!" అని నిట్టూర్చింది.

'ఓహో!' నిన్ను వేధిస్తున్న దదా? నీ కిష్టమయితే యిదుగో, యీ క్షణమే చదువు చెప్పడం ప్రారం భించనూ?"

"ఇష్టంలేకేమి? నే నెందుకు చదువుకోకూడదు?"

"నిజం, అకులినా! ఇప్పుడే ఇక్కడే మొదలు పెడదాం."

ఇద్దరూ నేలపైన కూర్చున్నారు. అలెక్జీ జేబు నుంచి పెన్సిలూ, నోటుబుక్కూ బయటికితీశాడు. అకులినా కొన్ని నిమిషాల్లోనే అక్షరాలు నేర్చుకొంది. ఆమె గ్రహణశక్తి చూచి అలెక్జీకి మహదాశ్చర్యమయింది.

మనసటి రోజు ఉదయం అకులినా వ్రాయడానికి ప్రయత్నించింది. మొదట్లో పెన్సిల్ పట్టుకోవడమే చేత కాలేదు. అయితే కొన్ని నిమిషాల్లోనే బహుచక్కగా రాయగలిగింది.

అలెక్సీ అన్నాడు: ఇదెంత అద్భుతమైన విషయ మనుకొన్నావు అకులినా! లంకాస్టరు పద్ధతి ననుసరించి చదువుకొనే వాళ్ళకన్నా త్వరగా నేర్చుకొంటున్నావు!"

మూడవ రోజుకు అకులినా "బోయరు కుమార్తె నటాల్యా" అనే పుస్తకం అక్షరక్షరనే కూడబలు కొ్కుంటూ చదువగలిగింది. అందులోని సామెతలు పెద్ద అక్షరాల్లో ఒక కాగితం వ్రాసుకొంటూ మధ్యమధ్య ఆమె చేస్తున్న వ్యాఖ్యలు వింటూంటే అలెక్సీ ఆశ్చర్యం పట్టలేకపోయాడు.

ఒక వారం గడవగానే, ఒకరికొకరు జాబులు రాసుకోగలిగేవరకు వచ్చింది అకులినా చదువు. వాళ్ళ పోస్టాఫీసు ఒక పురాతనమైన ఓక్ వృక్షంలోని తొర్ర; నాస్త్యా రహస్యంగా పోస్టు జవాను పనిచేసేది. అలెక్సీ స్ఫుటంగా లావుపాటి అక్షరాలతో రాసిన తన ఉత్తరాలు చెట్టు తొర్రలో వుంచి, అందులోనుంచి నాసిరకం నీలం కాగితంపై కొంకిలి గీత గీచినట్టుగా తన ప్రియురాలు రాసిన ఉత్తరాలు తీసుకొని వెళ్ళేవాడు. అకులినా శైలి

బుద్ధి సూక్ష్మం జాబుకు జాబుకు అభివృద్ధి అవుతున్నాయి !

ఈలోగా ఇవాన్ పెట్రోవిచ్ బెరిస్టోవ్, గ్రిగొరి ఇవానోవిచ్ మురోమ్‌స్కీల మధ్య ప్రారంభమయిన సుహృద్భావ సంబంధాలు దినదినాభివృద్ధి చెంది గాఢ స్నేహంగా పరిణమించింది. ఇందుకు క్రింది పరిస్థితులు కూడ తోడ్పడ్డాయి. ఇవాన్ పెట్రోవిచ్ తదనంతరం, అతని యావదాస్తి అలెక్సీ ఇవానోవిచ్‌కి సంక్రమించి, ఆ జిల్లాలో అందరికన్నా పెద్ద ఆస్తిపరు డవుతాడు. ఇలాంటివాడు లీసాను పెళ్ళిచేసుకొంటే బాగుంటుందని మురోమ్‌స్కీ ఆలోచించాడు. బెరిస్టోవ్‌కు కూడ మురోమ్‌స్కీ పైన సదభిప్రాయమేర్పడింది. మురోమ్‌స్కీకి కొన్ని తలతిక్క చేష్ట లున్నప్పటికీ (ఇంగ్లీషువాళ్ళ దేదైనా పడిచచ్చే పిచ్చి) కొన్ని సద్గుణాలు లేకపోలేదని బెరిస్టోవ్‌కు తోచింది. ముఖ్యంగా మురోమ్‌స్కీ మహా ఉపాయశాలి; రెండవది అతని దగ్గరిచుట్టం కౌంట్ ప్రోన్‌స్కీ, గవర్నమెంటులో పేరు, పలుకుబడీగల వ్యక్తి అలెక్సీకి మంచి ఉద్యోగం సంపాదించిపెట్టడానికి కౌంటు సహాయం చేయొచ్చు. కూతురికి మంచి సంబంధం దొరికి నందుకు మురోమ్‌స్కీ సంతోషించకపోడని కూడ బెరిస్టోవ్ అనుకొన్నాడు. కాని ముసలివాళ్ళిద్దరూ మన సులో మాట మనసులోనే వుంచుకొన్నారు. తుద

కొంకానొకరోజు హృదయాలు విప్పి మాట్లాడుకొని, ఆనందపరవశులై ఒకరి నొకరు కౌగలించుకొని వివాహ విషయంలో గట్టి ప్రయత్నం చేయాలని నిశ్చయించు కోవడం కూడ జరిగిపోయింది. ఇక యీ పెళ్ళి కుదర డానికై ఎవరికి తోచినవిధంగా వారు ప్రయత్నాలు ప్రారంభించారు.

మురోమ్‌స్కీకొక చిక్కువచ్చింది. తన కూతుర్ని, అలెక్సీని ఒకచోట చేర్చేదెలా? ఆనోజు తమ ఇంటికి బెరిస్టోవ్‌లు భోజనానికి వచ్చినపుడు తప్ప, తరువాత లిసా అలెక్సీని చూడనేలేదు. వారిద్దరికీ ఒకరిపైన ఒకరికి ఆకర్షణ ఏర్పడే సూచనలుకూడా లేవు. అలెక్సీ మళ్ళీ ఎప్పుడూ ట్రెలుచినోకు వచ్చిపోలేదు. అతనెప్పుడు తమ ఇంటికి వచ్చినా, లిసా అతణ్ణి చూడకుండా, తన గది లోకి వెళ్ళిపోయేది. "కానీ, అలెక్సీ రోజూ ఇక్కడికి వస్తూ,పోతూవుంటే బెస్టీకి వాడిపైన మనసు పోతుంది. ఇది ప్రకృతిలోనే వుంది. కాలంతో అంతా కుదుర బాటయిపోక తప్పదు" అని మురోమ్‌స్కీ అనుకొన్నాడు.

ఇవాన్ పెట్రోవిచ్‌కి తాను వేసుకొన్న ప్లాను జయప్రదం కావడంతో ఇలాంటి అనుమానాలేవీ లేవు. ఆ రోజు సాయంత్రమే బెరిస్టోవ్ కుమారుణ్ణి తన గదికి పిల్చి అతను రాగానే, పైపు ముట్టించి, కొంతసేపు మౌనం వహించి ఇలా అన్నాడు.

"ఏరా! అల్యోషా! మిలిటరీలో చేరాలనే విషయం ఈ మధ్య ఎత్తటమేలేదు. హుస్సార్ యూనిఫారంపైన మోజు తగ్గిందా ఏమిటి?"

అలెగ్జీ నమ్రతతో యిలా అన్నాడు :

"అదికాదు నాన్నా! నేను హుస్సార్ పటాలంలో చేరడం మీ కిష్టంలేదని నాకు తెలిసిపోయింది - మీ యిష్టానుసారం నడుచుకోవడం నా ధర్మం."

"సరైన మాటన్నావురా! కొడుకంటే అలా వుండాలి! నిజంగా నాకు బహు ఆనందంగా వుంది. నేనూ నిన్ను బలవంతపెట్ట దలచుకోలేదు. గవర్నమెంటు ఉద్యోగంలో చేరమని నిన్ను నిర్బంధం చేయను - యిప్పట్లో. ఈలోగా నీకు పెళ్ళిచేస్తామని వున్నా."

"పిల్లెవరు నాన్నా?" అని అడిగాడు అలెగ్జీ చకితుడై.

"లిసా ఇలా గ్రిగొర్యేవ్నా మురొమ్‌స్కాయా, చాలా మంచి సంబంధం."

"కాని, పెళ్ళిమాట నేనింకా ఆలోచించలేదు నాన్నా!"

"నీ వాలోచించలేదుకాబట్టి, నీ కోసం నేనే ఆలోచించి నిశ్చయం చేసేశాను."

"కాని నాన్నా! లిసా మురొమ్‌స్కాయా నాకు నచ్చలేదు."

"పెళ్ళయింతరువాత నచ్చుతుంది లేరా! అలవాటయితే, అదంతక దే ప్రేమ కలుగుతుంది."

"ఆమెను సుఖపెట్టగలననే ధైర్యంలేదు నాకు!"

"ఆమె సుఖం అలా వుంచవయ్యా! తండ్రిమాట మీరకుండా వుండడమంటే ఇదేనా? సిగ్గుండొద్దూ!"

"నాన్నా! మీ రేమైనా అనండి! నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు. ముమ్మాటికీ చేసుకోను."

"నీ వీ పెళ్ళి చేసుకుంటేసరి! నిన్ను సాపించి రాయిగుండూ కొట్టి—దేవుని సాక్షిగా చెప్పుతున్నా—నా ఆస్తి తెగనమ్మి ఒక్క చిల్లిగవ్వకూడ నీకు మిగల్చకుండా ధ్వంసం చేసేస్తాను. నీకు మూడురోజులు టైమిస్తున్నా. బాగా ఆలోచించుకో పో! ఈలోగా కంటికి అగపడేవ్ జాగ్రత్త!"

తన తండ్రి బుర్రలో ఏదైనా ఆలోచన ప్రవేశించిందంటే, తారస్ షెవ్చెంకో[14] అన్నట్టు, "ఒక ఇనపసీలతో" కూడా దాన్ని బుర్రనుండి బయటికి తీయలేమని అలెగ్జీకి తెలుసు. అయితే, అలెగ్జీకూడా తండ్రిపోలికే. అతని మనస్సు మార్చుకోవడంకూడ సులువైనపనికాదు. అలెగ్జీ తన గదిలోనికి వెళ్ళి ఆలోచించ సాగాడు. లిసా పెటూగ్రిగోర్యెవ్నా ఆకారం, "నిన్ను అడుక్కుతినేలా చేస్తాను. జాగ్రత్త" అన్న తండ్రి బెదరింపులు తలి దండ్రుల అధి

కారానికిగల పరిమితులూ - ఇవన్నీ అతని మనసులో మెదలు తున్నాయి. పాదరసంలా వరిపరివిధాల పరు గెత్తుతూన్న తన మనసు చివరకు అకులినాపై మళ్ళీ అక్కడ ఆగింది. అకులినాను తాను మనసారా ప్రేమి స్తున్నానని మొట్టమొదటిసారిగా అతని కర్థమయింది. ఒక పల్లెటూరి రైతుబిడ్డను పెళ్ళాడి తన రెక్కల కష్టంతో జీవించాలనే అపూర్వ భావం అతనిలో రేకెత్తింది. ఆలోచించేకొద్దీ ఇదే సరైన మార్గమనే నిశ్చయం అతనిలో పాదుకొల్పింది. జడ పట్టు కొన్నందువల్ల, కొద్ది రోజులుగా అతను వనంలోని సంకేత స్థలంలో అకులినాను కలుసుకోలేదు. వెంటనే అకులినా కొక జాబు రాశాడు. తమ సౌఖ్యానికి ఏర్పడనున్న అంత రాయాన్ని వివరించి, అకులినాను పెళ్ళిచేసుకోవడానికి తాను సిద్ధంగా వున్నట్టు తెలియజేశాడు. జాబులోని శైలి అతని హృదయంలోని ఆరాటం తెలియజేస్తున్నా, అక్ష రాలు మాత్రం ప్రస్ఫుటంగా వున్నాయి. జాబుముగించి, వెంటనే వెళ్ళి ఒక వృక్షంలోని పోస్టాఫీస్‌లో వేసి, తిరిగి వచ్చిన తరువాత అతడి మనసు తేలికయింది. రాత్రి హాయిగా నిద్రించాడు.

అలెక్జీ ఇలా ఒక కృతనిశ్చయానికి వచ్చినందువల్ల మరుసటిరోజు ఉదయమే మురోమ్‌స్కీని చూడడానికి వెళ్ళాడు - అతనితోనే నిర్మొహమాటంగా మాట్లాడా

లని. మురోమ్‌స్కీకి దయకలిగేలా చేసి, తనవైపుకు తిప్పు కోవాలని అలెక్జీ ఆశ.

"గ్రిగోరీ ఇవానొవిచ్ యింట్లో ఉన్నారా ?" అడిగాడు ప్రిలుచినో భవన సింహద్వారం ముందు గుర్రమాపి.

"లేదు బాబూ!" అని బయటవున్న నౌకరు సమాధాన మిచ్చాడు. "వారు తెల్లవారకట్టే బయట కెళ్ళారు."

"ఇంకేం చేద్దాం ?" అని అనుకున్నాడు మనసులో చిరాకుగా: "సరేకాని, లిసా ఎటా గ్రిగో ర్యేవ్నా ఇంట్లో వున్నారా ?" అని నౌకర్ని అడిగాడు.

"ఉన్నారండీ!"

అలెక్జీ క్రిందికి దూకి కళ్ళెం నౌకరు చేతికందిచ్చి, తాను వచ్చినట్లు లోపలకి చెప్పకుండానే యింట్లో ప్రవేశించాడు.

"అంతా చక్కబడుతుంది" అనుకున్నాడు అలెక్జీ పడసాలవైపు వెడుతూ: "ఆ అమ్మాయితోనే మాట్లాడు తాను అన్ని విషయాలు". పడసాలలో అడుగుపెట్టాడో లేదో అలెక్జీ దిగ్భ్రమతో నిశ్చేష్టుడై నిలబడ్డాడు......

......లిసా......కాదు అకులినా, ముద్దులొలికే తన అకులినా సరఫాన్‌లో కాక, ఉదయం ధరించే ఉల్లిపొర లాంటి తెల్లని గౌనులో కిటికీవద్ద కూర్చుని తన ఉత్తరం

చదువుకొంటూవుంది లిసా. జాబు చదువుకోవడంలో నిమగ్నమై అలెక్సీ వచ్చిందికూడ గమనించలేదు. ఆనందం పట్టలేక, అప్రయత్నంగా అతని కంఠంనుండి వెలువడిన ధ్వని విని లిసా అదరిపడి పైకిచూచింది. వెంటనే ఒక కేక వేసి, అక్కడినుండి పరుగెత్తి పోవడానికి ప్రయత్నించింది. . ." "అకులినా! అకులినా!"అనిఅంటూ అలెక్సీ ఆమెను బలవంతంగా ఆపడానికి ప్రయత్నించాడు. లిసా తప్పించుకొనిపోవడానికి చూస్తూ, మధ్య మధ్య ఫ్రెంచిభాషలో "ఏమిటండీ ఆగడం ?" అంటోంది. ఆమె చేతులపై ముద్దులు కురిపిస్తున్న అలెక్సీ నోటినుండి "అకులినా! అకులినా! ప్రియా !" అని తప్ప వేరుమాటలు రావడం లేదు. లిసా ప్రక్కనే కూర్చొనివున్న మిస్ జాక్సన్ కిదంతా అయోమయంగా వుంది. ఆ క్షణంలో తలుపు తెరుచుకొని గ్రిగోరి ఇవానోవిచ్ లోపల ప్రవేశించాడు.

"ఓహో ! వ్యవహారం మీరే నడుపుకొంటున్నారన్నమాట !" అని అన్నాడు.

ఈ కథ ఎలా ముగిసిందో చెప్పడం అనవసరం. సెలవు.

1830

ఐ. పి. బెల్కిన్ కథలు సమాప్తం.



# వివరణ

1. 18 వ శతాబ్దిలోని సుప్రసిద్ధ రష్యన్ నాటక కర్త, పాత్రికేయుడూ అయిన డెన్నిస్ ఫొన్ విజిన్ రాసిన నాటకం. 1782 లో ప్రచురింప బడింది.
2. పుష్కిన్ స్నేహితుడు ఎవ్‌జెని బరటిన్‌స్కీ రచించిన పుస్తకం "ది బాల్".
3. 1825 డిసెంబరు 14 నాటి సాయుధ తిరుగుబాటులో చురుగ్గా పాల్గొన్న బెస్టుజెవ్ - మర్లిన్‌స్కీ రాసిన కథ. జారు చక్రవర్తుల కాలంలో వున్న ఆంక్షల మూలంగా పుష్కిన్ గ్రంథకర్తను పేర్కొనకుండా, వదలివేయవలసి వచ్చింది. కాని ఇతని రచనను ఉదహరించడం ద్వారా పుష్కిన్ డిసెంబరు విప్లవకారులపట్ల తనకుగల సానుభూతిని పాఠకులకు స్ఫురింప చేస్తున్నాడు.
4. కావ్యాలూ, రణవిద్యపైన గ్రంథాలూ, రాసిన డెనిస్ దవిడొవ్ పుష్కిన్ స్నేహితుడు. 1812 లోని యుద్ధంలో ఒక పటాలానికి అధిపతిగా పనిచేశాడు. ఇది రైతు వాలంటీర్ల సహాయంతో ఫ్రెంచి దురాక్రమణదారులతో తలపడి వీరోచితంగా పోరింది.

మాతృదేశ విముక్తికై రష్యనులు చేసిన యీ యుద్ధంలో పాల్గొన్న వీరుల్లో ఒరొస్టొవ్ ఒకడు. డెనిస్ దవిడొవ్ తన పద్యాల్లో తరచుగా యితణ్ణి పేర్కొన్నాడు.

5. ప్రథమ ముద్రణలో తరువాత యిలా ఉంది: తుదకు సాధ్యమయినంత త్వరగా పడుకోవాలనీ, మధ్యాహ్నం సాధ్యమయినంత ఆలస్యంగా భోజనం చేయాలని నిశ్చయించుకొన్నాను. ఈ విధంగా పగటివేళను హెచ్చించి, సాయంకాలం ఘుడియలు తగ్గించాను ఉన్న పరిస్థితుల్లో యింతకన్నా మంచి వుపాయం నాకు తోచలేదు.

6. ఒక రష్యన్ జనరల్. 1820 లో టర్కీ దురాక్రమణ నుండి గ్రీసును విముక్తి చేయడానికి పూనుకొన్న రహస్య విప్లవ సంఘ నాయకుల్లో ఒకరు. 1821 లో ప్రుట్ నదీతీరంపై స్కుల్యాని గ్రామంవద్ద టర్కీ సైన్యాలు ఇప్సిలాంటి దళాన్ని ఓడించాయి.

7. రష్యన్ కవీ, అనువాదకుడూ అయిన వాసిలీ జుకొవ్‌స్కీ (1783-1852) వ్రాసిన జానపద గేయం 'స్వెట్లానా' నుండి.

8. "దుఃఖానికి దారితీసిన హాస్యం" - ఇది 19 వ శతాబ్ది నాటకకర్త, రాజకీయవేత్త అయిన అలెగ్జాండర్

గ్రిబొయెడోవ్ రచించిన సుప్రసిద్ధ నాటకం. పుష్కిన్ సమకాలికుడైన ఈయన వ్రాసిన ఈ నాటకం పుష్కిన్ విప్లవగీతాల వలె డిసెంబ్రిస్ట్ విప్లవయుగం సృష్టించిన సాహిత్యంలో ప్రముఖ స్థాన మాక్రమిస్తున్నది.

9. ప్రసిద్ధుడగు 18 వ శతాబ్ది కవి గబ్రీల్ డెర్జవిన్ రచించిన గేయం "జలపాతం."

10. 19 వ శతాబ్దంలో ఆన్టోనీ పొగొరెవ్‌స్కీ అనే ప్రచ్ఛన్న నామంతో వ్రాసిన అలెక్సీ పెరొవ్‌స్కీ నవలలోని ముఖ్యపాత్ర.

11. 19 వ శతాబ్దం కవి పైయొటర్ వ్యాజెమ్‌స్కీ.

12. టెరెంటియిచ్; 18 వ శతాబ్దం నాటి కవి ఇవాన్ డిమిట్రీవ్ రచించిన "వ్యంగ్య చిత్రం" అనే పద్యం లోని ఒక పాత్ర (ఇంటిలెట్టి).

13. 18 వ శతాబ్ది కవి ఇప్పొలిట్ బోగ్ డానవిచ్ రచించిన "ప్రేయసి" అనే పద్య కావ్యం.

14. ఫాన్‌విసిన్ రచించిన "మూర్ఖుడు" అనే నాటకం లోని ఒక భూమిక (అజ్ఞానీ, మొరకూ అయిన పాతకాలపు భూస్వామి).

*